

# విషయానుక్రమణిక

## 18 ఏప్రిల్ 1951





# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **31**

ఖర సంవత్సర చైత్ర శుద్ధ ద్వాదశి బుధవారము


## దివ్యస్మృతి

తెలుగు పంచాంగం ప్రకారం నేడే శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు గారి వర్ధంతి. దేశోద్ధారకుడు, విశ్వదాత, కళాప్రపూర్ణుడు అని యావద్భారతమున ప్రఖ్యాతిగాంచిన ఈ మహాపురుషుడు కైలాసేశ్వరుని సాయుజ్యముపొంది త్రయోదశాబ్దములు గడిచినవి. నేటికిని వారి దివ్యసంస్మృతి ఆంధ్రులకు చెక్కుచెదరని ధ్రువతారయై, మార్గదర్శియై వెలుగొందుచున్నది.

పంతులుగారి జీవితపరమార్థములలో ఒకటియైన భారతస్వాతంత్ర్యము సిద్ధించి నాలుగేండ్లు కావచ్చుచున్నను, ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము లభించు భాగ్యమింకను పట్టలేదు. ఆంధ్రోద్యమమునకు పంతులుగారు వేగుజుక్క. కృత్రిమముగా నిర్మితములైన వివిధరాష్ట్రములలో, సంస్థానములలో చెల్లాచెదరై, తామందరమొక జాతివారము, ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే చరిత్ర గలవారము అనువిషయమును విస్మరించుచున్న మూడుకోట్ల ఆంధ్రప్రజలకు ఏకత్వ శంఖారావమును గావించిన తెలుగు జోదు పంతులుగారు. ఆంధ్రుల అనైక్యతా కారణమున నేమి, జాతీయ ప్రభుత్వ ప్రాతికూల్యకారణమున నేమి, ఆంధ్రుల చిరకాలాశయము, పంతులుగారి జీవిత తపోలక్ష్యము నైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణావకాశము దవ్వు దవ్వగుచున్నదేగాని, ఆశ లేశమైన తోచదు.



నేటిభారతదేశ పరిస్థితులలోని అవ్యవస్థ, ముఖ్యముగా ఆంధ్రరాష్ట్రరాజకీయములందలి విపరీత పరిణామములు, పంతులుగారు బ్రతికి యుండినచో వారిహృదయము నెంత గాయపరచియుండెడివో! ఐకమత్యసాధనకే వారు జీవితమును వెచ్చించినారు; వర్గములకు, వ్యక్తులకు అతీతులై, సమష్టిప్రయోజనములనే ఆదర్శములుగా నిడుకొని సారథ్యము నిర్వహించినారు; జాతీయకాంగ్రెసును త్యాగమయ సంస్థగా, ప్రజాహితైకకాంక్షిగా నొనర్చినారు. నాటికి, నేటికి సంభవించిన దుష్పరిణామములు శోచనీయమైనవి. నాయకులు పదవీవ్యామోహితులై, స్పర్థలతో, స్వార్థములతో ప్రజానురాగమునకు దూరమైరి. ఎన్నికలలో విజయము మీదనున్న దృష్టి ప్రజలయెడ తమ కర్తవ్యముపై లేదు. గతమున స్వాతంత్ర్యసమరములో నిస్వార్థ

(43-వ పేజీ చూడండి)

# ఆంధ్ర కాంగ్రెస్ విచ్ఛిత్తి



★

(సీతారామ్)

ప్రకాశంగారు, విశ్వనాధంగారు, రంగాగారు, వారి మిత్రులు కాంగ్రెస్ సంస్థనుంచి విడివడి పోతున్నారంటే ఆంధ్ర కాంగ్రెస్‌లోనే కాదు, ఆంధ్రదేశమంతటా చింతించనివారుండరు. ఈ పరిణామాల వల్ల సంజీవిరెడ్డి, కళా వెంకట్రావుగార్లకు కూడా చింత కలగకపోదు. అయితే ఈ నాయకులు ఎట్టి పరిస్థితులలో, ఏరీతిగా మాతృసంస్థను విడిచి వెళ్లిపోతున్నదీ గమనించినట్లయితే, కాంగ్రెస్ సంస్థే దేశానికి సర్వస్వం అని పరిగణించుకొనేవారికి విషాదం కలుగుతుంది.

గాంధీమహాత్ముని బోధనలు హృదయపూర్వకంగా విశ్వసించి, ఆంధ్రదేశంలో కాంగ్రెస్‌ను ప్రతిష్ఠాపించి, ఆంధ్ర కాంగ్రెస్‌ను రూపొందించిన దేశోద్ధారకులు, పట్టాభి, వెంకటప్పయ్య మొదలైన నిర్మాతలతో కలిపి ఎన్నదగినవారు ప్రకాశం పంతులుగారు. స్వాతంత్ర్య సమరంలో అపారసంపదలను సౌఖ్యాన్ని త్యాగంచేసి అపూర్వసాహసం ప్రదర్శించి ఆంధ్ర ప్రజానీకం ప్రత్యేక అభిమానాన్ని పొందినవారు ప్రకాశంగారు. ఈ అగ్ర నాయకుల త్యాగసేవాఫలితమే ఈనాటి ఆంధ్రకాంగ్రెస్. మిగిలిన ఈనాటి నాయకులందరూ వీరి ఉత్తరవారసులే. కాగా ఈనాటికి ప్రకాశంగారు కాంగ్రెస్ సంస్థను విడిచిపెట్టి క్రొత్తగా ప్రతికూల రాజకీయ సంస్థను స్థాపించ పూనుకోడం వైపరీత్యమనే అనాలి. ఈ వైపరీత్యం పరిస్థితులలోనే కాదు, ప్రకాశంగారి వ్యవహారవిధానంలోకూడా కనిపిస్తుంది. సుదీర్ఘ జీవనకాలాన్ని వ్యయపరిచి ఆంధ్ర కాంగ్రెస్ నిర్మాతలలో ఒకరైన ప్రకాశంగారు ఆంధ్ర కాంగ్రెస్‌ను విడిచిపెట్టడం, ఉత్తరవారసులైనవారు క్రమబద్ధవర్తనగురించీ కాంగ్రెస్ పవిత్ర ఆదర్శనియమాలను గురించీ ప్రకాశంగారికి బోధలు చెయ్యడంకంటె మించిన వైపరీత్యం లేదు.

ప్రకాశంగారికి సంబంధించినంతవరకూ వారే ఈ విపర్యయానికి కారకులని చెప్పాలి. కాంగ్రెస్ సంస్థలో ఉండడంవల్ల తమ ఆశయాలు నెరవేరవని గ్రహించినవారైతే, గ్రహించినవెంటనే వారు సంస్థనుంచి నిష్క్రమించవలసింది. ఇప్పుడు ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షు ఎన్నికలలో పాల్గొని, ఓటమి సంభవించిన తరవాత నిష్క్రమించడం కేవలం పదవి లభించనందువల్లనేనని వారు దేశానికి చాటి చెప్పుకున్నారన్నమాట.

ఆంధ్ర కాంగ్రెస్ ఎన్నికలన్నీ సక్రమంగా జరిగాయనికాని, మంత్రివర్గపక్షం వారి వ్యవహారం సక్రమమైనదనిగాని ఎవరూ చెప్పలేరు. ఉభయవర్గాలవారూ



గత బుధవారం విజయవాడలో జరిగిన ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నిక సందర్భములో ప్రజలు వేలాదిగా వచ్చి చూశారు.

సమానంగా ఆంధ్ర కాంగ్రెస్ ఎన్నికల్ని కల్లోలమయంచేసి, అతినీచమైన తంత్రాలకు దిగి దేశంలో కాంగ్రెస్‌కి అప్రతిష్ఠ తెచ్చిపెట్టినవారే. ప్రజలకీ నాడు కాంగ్రెస్ అంటే పదవులకోసం తంత్రాలు పన్నే సంస్థ తప్ప అన్యం కాదనే భావం స్థిరపడిపోయింది. ఈ భావం సత్యమేనని ఉభయవర్గాలవారూ వెయ్యివిధాల నిరూపించారు. ప్రైమరీసభ్యుల జాబితాల్ని ఎవరి కిష్టం వచ్చినట్లు వారు తయారు చెయ్యడం మొదలు కోర్టుల కెక్కడం, సభ్యుల్ని బెదరించడం, తాడించడం, లంచాలివ్వడం, పదవు లివ్వజూపడం, అన్నిరకాల అక్రమాలూ ఉభయవర్గాల వల్లా జరిగాయి. ఒకరి వర్తన సక్రమమై మరొకరిది అక్రమమైతే, ఎన్నికల్ని అంగీకరించకపోవడంఅంటూ ఉండవచ్చును. కాని ఉభయత్రా అక్రమాలు జరిగాయని ఉభయులూ అంగీకరించిన తరవాత, పోటీ సమఉజ్జీలుగానే జరిగిందని ఒప్పుకోవాలి. ఇంక జరిగిన ఎన్నికల్ని అంగీకరించకపోవడం అనగా ఎటువంటిది? పోటీలో పాల్గొన్న తరవాత, ఒకరి విజయానికీ, ఒకరి అపజయానికీ సంసిద్ధులైనారన్నమాట. అపజయం పొందినవారు పోటీ అక్రమం అన్నారంటే అర్థంలేదు. అక్రమం అపజయం పొందినవారి వర్తనలో కూడా అది నించీ ఉండనే ఉంది. కిందటిమారు అధ్యక్ష ఎన్నికలో (చీరాల) సంజీవిరెడ్డిగారు అపజయం పొందినప్పటికీ, గెలుపొందిన రంగాగారిని అధ్యక్షులుగా అంగీకరించి, కార్యవర్గ ఎన్నికలలో పాల్గొన్నారు కాని కాంగ్రెస్ సంస్థను కూలదన్నలేదు. నాడు కార్యవర్గ నిర్మాణంలో ప్రతికూలవర్గం సహకారాన్ని కోరాలనే ఉదారబుద్ధయినా రంగాగారికి లేకపోయింది. ఇప్పుడు గెలుపొందిన సంజీవిరెడ్డిగారు కార్యవర్గంలో సగం సభ్యత్వాలు ప్రకాశంగారి వర్గానికిస్తామని చెప్పారంటే, అది ఉదారబుద్ధివల్ల కానీయండి, స్వలాభాపేక్షవల్ల కానీయండి, కాంగ్రెస్ సంస్థ క్షేమానికి తోడ్పడగల సూచన అని చెప్పాలి. ఆంధ్రకాంగ్రెస్‌లో ఐక్యత సాధ్యమైనా కాకపోయినా, అన్ని వర్గాలవారికీ స్థానమివ్వడానికి ఉద్దేశించబడిన ఈ యత్నాన్ని దేశమంతా హర్షించగలదు.

పార్లమెంటరీ డెమోక్రసీలో అల్పసంఖ్యాకవర్గాల రక్షణకు, అధికసంఖ్యాకవర్గాలతో సమానంగా వారి అభ్యున్నతికి, తగిన ఏర్పాట్లున్నాయి. అయితే అవి అన్ని దేశాలలోనూ సక్రమంగా ఆచరణలో పెట్టబడుతున్నాయని చెప్పడానికి వీల్లేదు. సక్రమంగా జరక్కపోవడమే అధికంగా కనబడుతుంది. భారతదేశంలో బలీయమైన ప్రతికూలపక్షం అనేది లేకపోవడంవల్ల ఈ బాధ్యత పూర్తిగా కాంగ్రెస్‌పైనే పడుతోంది. దేశంలో పరిపాలనా వ్యవహారాలు దిగజారిపోతూ ప్రజల అసంతృప్తి అధికమౌతున్న ఈ సమయంలో, మంత్రివర్గాలు ప్రజల అభిమతాన్ని మన్నింపచేయగలగాలంటే, బలీయమైన ప్రతికూలపక్షం అవసరం. కాంగ్రెస్‌లోనే వైషమ్యాలు సంభవించి వర్గాలు ఏర్పడినప్పటికీ, పరిపాలనావిధిలో మంత్రివర్గాలను అదుపులో

## అమెరికా గోధుమలు

అమెరికా గోధుమలు పంపించే అవకాశం
ఇటీవల ఎక్కువైనట్లు అభిజ్ఞుల విశ్వాసం;
కనుక అనుకున్న ప్రకారం మన ప్రభుత్వం
సాధిస్తుంది ఆహారస్వయం ముఖ్యత్వం.

ఇండియాలోని అన్నార్తులంటే, పాపం,
ట్రూమన్ గారి కెక్కడలేని సానుతాపం;
అసలాయన దయార్ద్రబుద్ధికి తార్కాణం
ఆసియాలో అమెరికన్ల విధానం.

ఇది గ్రహించిన మసానీలాంటి "యమ్పీ"లు
ఇదివరకే పంపారొక జరూరు అప్పీలు;
అంతమాత్రాన వారికి తెలియదని కాదు
అమెరికన్ ధాన్యాల రాజకీయ ఖరీదు.

మనం కోరిం దాహారంకనకే ఈ వైమనస్యం;
మారణాస్త్రాలైతే జరిగేదా ఇంతాలస్యం?
అయినా, మిగులు ధాన్యం సముద్రంలో పోస్తే
వాళ్లకి లాభంగాని, ఏం లాభం మన కిస్తే?

మానవ జీవితాలతో జరిగే వ్యాపారం
అమెరికా ఆర్థికవ్యవస్థ కాధారం;
అన్నానికి నోచుకోని అభాగ్యుల ప్రాణాలు
డాలర్ల ఉత్పత్తికి ముడిపదార్థాలు.

ఇండియాకు త్వరలో ధాన్యం రావచ్చును,
ఇండియాకు క్షామభయం తీరిపోవచ్చును:
'కుడ్యవీథి' జలగలు వరమిచ్చే వేలుపులై—
యాంకీ సెనేటు మరతులు మర్యతులై—

—సవ్యసాచి—



శ్రీ కళా వెంకట్రావు, సంజీవరెడ్డి ప్రభృతులు.

ఉంచి సక్రమమార్గంలో వర్తింపచెయ్యడానికి తగినబలం ప్రత్యర్థివర్గాలకు లేకపోతున్నది. దీనికి పార్టీనియమాలు క్రమశిక్షణ నిర్బంధాలు కొంత కారణం.

కాంగ్రెస్‌ని ప్రధానంగా పార్లమెంటరీ వ్యవస్థలో ఏకైక జాతీయసంస్థగా పరిగణించాలంటే, (బలీయమైన ప్రతికూలపక్షం లేని పరిస్థితిలో) క్రమశిక్షణవిధానం సడలింపబడి, అధికారేతర కాంగ్రెస్ వర్గాల స్వతంత్ర వ్యవహారానికి అవకాశ మివ్వవలసిన అవసరం ఉంది. అట్టి అవకాశం లేనిచోట అన్యవర్గాలు మాతృసంస్థనుంచి విడిపోయి ప్రతికూల రాజకీయపార్టీలు స్థాపించడం యూరోపియన్ దేశాలలో అనుభవమే. ఈ దృష్టితో చూసినట్లయితే ప్రకాశం రంగాగార్లు కాంగ్రెస్‌నుంచి వేరై ప్రత్యేకరాజకీయసంస్థ స్థాపించడం దేశానికి మేలే అని చెప్పవచ్చును—వీరు పార్లమెంటరీ డెమాక్రసీపట్ల విశ్వాసం కలిగిఉండి, రాజకీయపార్టీల వ్యవహార విధానాన్నే సక్రమంగా అనుసరించగలిగేవారైతే. కాని ఇటు వీరుకాని అటు మంత్రివర్గంవారు కాని సక్రమంగా అనుసరించగలవారు కాదని ఇప్పటి వీరి వ్యవహారనీతివల్ల తెలుస్తూనే ఉంది. ఇది ఒక విషయంలో స్పష్టంగా గోచరిస్తోంది. ఆంధ్రదేశంలో ఎన్నికైన 166 మంది కాంగ్రెస్ ప్రతినిధుల్లోనూ చెన్నపట్నం ప్రతినిధి ఒక్క దేవసహాయంగారు మినహా ఒక్క హరిజన సభ్యుడుకాని మహమ్మదీయ సభ్యుడుకాని లేడు. ఆంధ్ర కాంగ్రెస్‌లో ఈ అల్పసంఖ్యాక వర్గాల వారికి స్థానమే లేకపోయిందా? కేవలం పదవుల పోటీలలో న్యాయాన్యాయాలు, ఉచితానుచితాలు మరిచిపోయి, రాజకీయ నాయకులుగా తమ కర్తవ్యాన్ని విస్మరించినందువల్లనే నేడు ఆంధ్రకాంగ్రెస్‌కీ ఈ గుర్గతి పట్టింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ఇదివరలో రద్దయిందంటే రంగావర్గమూ, వెంకట్రావువర్గమూ కూడా ఈ అప్రతిష్ఠకు సిగ్గుపడాలి. ఆంధ్ర కాంగ్రెస్‌లోని ఏవర్గమూకూడా హరిజనులకుగాని మహమ్మదీయులకుగాని స్థానమివ్వలేకపోయిందంటే దేశం వీరిని నమ్మి ఎంత చెడిపోతున్నదో, వీరు ఎంత అన్యాయానికి ఒడిగట్టుతున్నారో బోధపడుతుంది. వీరిలో ఏ ఒక్కరూ గాంధీ మహాత్ముని పేరైనా స్మరించడానికి అర్హులు కారు. ఉభయవర్గాలవారూ కాంగ్రెస్ పేరు విసర్జించి కొత్తపేర్లు, తమకు తగిన పేర్లు పెట్టుకోడం మేలు. మంత్రివర్గంచేత జిక్కిన ఆంధ్రకాంగ్రెస్ కాంగ్రెస్ కాజాలదు. ప్రకాశం రంగాలు సృష్టిస్తున్న ప్రజాపార్టీ ప్రజల పార్టీ కాజాలదు. ఉభయపార్టీల వల్లనూకూడా అల్పసంఖ్యాక వర్గాలకు రవ్వంత మేలు చేకూరదు. ప్రకాశం గారు 'ప్రకాశమే ప్రజ, ప్రజలే ప్రకాశం' అని పదిసభల్లో పదేసిసార్లు చెప్పుతున్నా, 'రైతులు కూలీలు బుద్ధిజీవులు' (ఇవేవో కొత్తజీవాలు కాబోలు, వీరికి తప్ప మరెవ్వ



రంగా, గౌతు లచ్చన్న ప్రభృతులు.

రికీ బుద్ధిలేదని కాబోలు) కోసమే తమ పార్టీ పుట్టి పెరిగి గంతులు వేస్తోందని రంగాగారెంతగా చెప్పుకున్నా, ఇవన్నీ తమకు తాము మోసపుచ్చుకోడానికో, లేక ఓట్లు తప్ప మరేమీ లేని ప్రజల్ని మోసపుచ్చడానికో చెప్పే మాటలుతప్ప విలువలేనివి.

కాంగ్రెస్ దేశసేవకోసం ప్రజల అభ్యుదయం కోసమే పుట్టి దేశమంతటా వ్యాపించగా చూసి భక్తితో గౌరవించినవారికి కాంగ్రెస్‌నించి ప్రకాశంగారు వెళ్ళిపోవడం విచారకరమైన విషయమే. కాని కాంగ్రెస్‌వాదులు దేశసేవను మూలబెట్టి అధికారసాధనకోసం పరికరంగా కాంగ్రెస్‌ని వినియోగించుకున్నప్పటినుంచీ, కాంగ్రెస్‌ను చూసి వారు విచారిస్తున్నారు. ఇంతకంటె ప్రకాశంగారి నిష్క్రమణ ఎక్కువది కాదు. ఈ దుర్దశకి ప్రకాశంగారి బాధ్యత తక్కువ కాదు. రంగాగారి నిష్క్రమించినందుకు ఎక్కువ చింతించవలసిన అవసరం లేదు. వీరి రాజకీయజీవితం గాంధీమహాత్ముని దూషించడంతో ప్రారంభమయింది. స్వయంగా కిసాన్ సభను స్థాపించి రాజకీయాల్లో ప్రవేశించిన రంగాగారికి కాంగ్రెస్‌పట్ల భక్తిఅనేది ప్రకాశం వెంకట్రావు ప్రభృతుల కున్నంత ఎన్నడూ లేదు. వారి పార్టీ ఉద్యమవిధానానికీ కాంగ్రెస్ ఉద్యమ విధానానికీ చాలా అంతరం ఉంది. దేశంలో కాంగ్రెస్ పరపతి చూసి కాంగ్రెస్‌లో చేరి వీరు అధ్యక్షపదవిని అంకిచుకున్నారు. కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గంలో సభ్యత్వంకోసం



ప్రపంచ కథానికల పోటీ సందర్భంలో అఖిలభారత పోటీలో రెండవ బహుమానం అందుకున్న
శ్రీ పాలగుమ్మి పద్మరాజు



ఎన్నికలను నిర్వహించిన ప్రత్యేకాధికారి శ్రీ యస్. కె. పాటిల్

ప్రకాశంగారికీ, వారి డెమోక్రటిక్ ఫ్రంట్‌కీ దూరంగా నిలిచారు ఇన్నాళ్లూ. ఆ సభ్యత్వం తమకివ్వనందుకు ప్రకాశంగారు రంగాగారిని సభ్యత్వానికి రాజీనామా ఇవ్వాలని బహిరంగసభలో చెప్పారు. కేంద్రకాంగ్రెస్ కార్యవర్గంలో ఎన్నడూ ప్రకాశంగారిని సవ్యంగా బలపరచలేకపోయిన రంగాగారు, ఆంధ్ర కాంగ్రెస్ ఎన్నికల్లో ప్రతిపక్షం బలపడినప్పుడు మళ్లీ ప్రకాశంగారి అండను చేరారు. వీరి అండను చేరిన రంగాగారు ఈనాటికి వైరుధ్యంలో కాకపోయినా మిత్రత్వంలోనైనా ప్రకాశంగారి అభిమతాన్ని నెరవేర్చి, కార్యవర్గ సభ్యత్వానికి రాజీనామా ఇవ్వగలుగుతున్నారు.

కాంగ్రెస్ సంస్థచరిత్రనూ దేశానికి ప్రాణంవలె ఉన్న ఆ సంస్థ ఉనికినీ దృష్టిలో పెట్టుకొని చూసినట్లయితే, ప్రకాశం ప్రభృతుల నిర్గమనం శోచనీయమైనదే. కాంగ్రెస్ సంస్థ క్షేమందృష్ట్యా చూస్తే, కాంగ్రెస్ నిబంధనల ననుసరించలేనివారు నిష్క్రమించడమే మేలు. రాజకీయాల దృష్ట్యా చూస్తే, వారి ప్రజాపార్టీ ఉన్నా ఒకటే లేకున్నా ఒకటేనని తోచకమానదు. ఈ కొత్త పార్టీ పుట్టుక చూస్తేనే చాలు, కాంగ్రెస్ రాజకీయపార్టీ కంటె ఎన్నడూ మేలుగా ఉండబోదని తెలుస్తోనే ఉంది.

★

# మెకార్థర్‌కి స్వస్తి ★ [సూర్యనారాయణ]



సీజర్, అలెగ్జాండర్ల మొదలు హిరోహిటో వరకూ సైనికవీరులతోనూ చక్రవర్తులతోనూ పోల్చబడిన అమెరికన్ సైనికాధిపతి మెకార్థర్ సైన్యాధిపతిత్వానికి స్వస్తిచెప్పబడింది. అతని స్థానే, నిత్యం జేబుల్లో చేతిబాంబులు పెట్టుకు తిరిగే లెఫ్టినెంట్ జనరల్ మాథ్యూబి,రిడ్జ్‌వే నియమించబడ్డాడు.

జనరల్ మెకార్థర్‌కి స్వస్తిచెప్పడంలో ఆసియాలో పెద్దయుద్ధం జరిగే ప్రమాదం తప్పిపోయిందని ఆసియా పశ్చిమ యూరప్ లలో అందరూ సంతోషిస్తున్నారు. అసలు కొరియాలోనే యుద్ధం సమాప్తమై శాంతి ఏర్పడవచ్చునని కొందరన్నారు. కాని ట్రూమన్ ప్రకటనల్నిబట్టి, పెకింగ్ రేడియో వ్యాఖ్యానాల్నిబట్టి అటువంటి ఆశ లేదని తేలిపోయింది.

మెకార్థర్ పతనానికి తక్షణకారణం రాజకీయ విధానాన్ని గురించి అతను చేసిన ప్రకటనలు. ఈ ప్రకటనల్లో ముఖ్యమైనవి రెండు. 1. చియాంగ్ సేనల్ని పంపి చీనా తీరంపైనా మంచూరియాపైనా కూడా యుద్ధాన్ని వ్యాపింపచెయ్యడం అవసరమని సూచిస్తూ మెకార్థర్ అమెరికన్ కాంగ్రెస్‌లోని రిపబ్లికన్‌పార్టీ నాయకుడు మార్టిన్‌కి వ్రాసిన లేఖ. 2. ఫార్మోజా ఐక్యరాజ్యసమితి సభ్యత్వాల ప్రసక్తి లేకుండా చీనాని శాంతికి ఒప్పందలకి రావాలని చెప్తూ, అలా రానిపక్షంలో మంచూరియాపైనా చినాతీరంపైనా బాంబులువేసి చీనా సైనికబలాన్ని అణచగలనని బెదిరించడం.

తమ అనుమతిలేనిదే రాజకీయ వ్యవహారాలకు సంబంధించిన స్వతంత్ర ప్రకటనల్ని చెయ్యరాదని అమెరికన్ రక్షణశాఖ 1950 డిసెంబర్ 6 వ తేదీని మెకార్థర్‌కి ఆజ్ఞ ఇచ్చింది. ఈ ఆజ్ఞను ఉల్లంఘించి మెకార్థర్ పై రెండు ప్రకటనలూ చేశాడు. ఉల్లంఘించడమే కాకుండా, అమెరికన్ విదేశాంగవిధానంతో మెకార్థర్ సహకరించలేకపోతున్నందువల్ల అతన్ని బర్తరఫ్ చేయవలసివచ్చిందని ట్రూమన్ ప్రకటించాడు.

అమెరికన్ ప్రభుత్వ విదేశాంగ విధానానికీ, మెకార్థర్ సాధించదలచిన ఆశయాలకీ వ్యత్యాసం ఉన్నమాట నిజమే. కాని అమెరికన్ ప్రభుత్వ విదేశాంగ విధానానికీ బ్రిటిష్ ప్రభుత్వ విదేశాంగ విధానానికీ వ్యత్యాసం అధికం.

జనరల్ మెకార్థర్‌ని అమెరికన్ జాతి అంతా తమ ప్రపంచ సార్వభౌమత్వానికీ, సైనికబలాధిక్యతకీ చిహ్నంగా ఎంచుకోడం పరిపాటి అయింది. జపాన్‌లో మిత్రరాజ్య కూటంతరఫున అధిపతిగా నియమితుడైనప్పటికీ మెకార్థర్ ఎన్నడూ ఏ మిత్రరాజ్యం అభిమతాన్నీ మన్నించలేదు. జపాన్ తన స్వంత వలసయినట్లు భావించి పరిపాలించాడు. జపాన్ విషయంలో అమెరికన్ ప్రభుత్వం ఎలా వ్యవహరించాలో ఇంతవరకూ మెకార్థర్ నిర్ణయాల ప్రకారమే నిర్ధారణయ్యేది. అమెరికన్ విదేశాంగమంత్రికి ఇష్టంలేకపోయినా తన ఇష్టంవచ్చినట్లే నిర్వహించేవాడు. వీరిద్దరికీ మధ్య అభిప్రాయభేదాలు ఎక్కువైనప్పుడు మెకార్థర్‌ని ఎన్నిమార్లు అమెరికా రావాలని ఆజ్ఞఇచ్చినా అతను పాటించలేదు. ట్రూమన్ స్వయంగా వేక్ ద్వీపానికి వెళ్లి అతనితో మాట్లాడవలసివచ్చింది.

మెకార్థర్ సైనిక జీవితం మొదటినుంచీ ఆసియాలోనే గడిచింది. ఆసియాలో అమెరికన్ ప్రజాస్వామ్య విధానాన్ని నేర్పవలసిన అవసరం ఉందనీ, ఇందుకు అమెరికన్ సైనికబలాన్ని ప్రయోగించవలసిన అవసరం ఉందనీ అతని అభిప్రాయమైనట్లు లైఫ్ పత్రిక విలేఖరితో ఇదివరలో చెప్పాడట. ఆసియావాసులు మామూలుగా చెప్తే వినరనీ తన్ని చెప్తేనే వింటారనీ ఇతని అభిప్రాయం. కమ్యూనిజాన్ని ప్రపంచంలో అణిచెయ్యాలంటే ఈ కాంక్ష ఆసియాలో యుద్ధంవల్ల జరగవలసిందే కాని యూరప్‌లో కాదని అతని అభిప్రాయం. అయితే యుద్ధం వచ్చినా, సైనికబలాన్ని వృద్ధి చేసుకుని ప్రజాస్వామ్య దేశాల్ని కాపాడాలన్నా యూరప్‌ని ప్రధానంగా పరిగణించాలి కాని ఆసియా ప్రధానం కాదని పశ్చిమయూరప్ రాజ్యాలు, అమెరికన్ విదేశాంగ మంత్రుల అభిప్రాయం.

మెకార్థర్ యుద్ధాలలో మహావీరుడే కాని, ఎప్పుడూ అతని లెక్కలు తప్పుతూనే ఉన్నాయని రిపోర్టర్ అనే పత్రికలో ఒక రచయిత వివరించాడు. రెండో ప్రపంచ యుద్ధంలో న్యూగినీ యుద్ధాలలోనూ, ఫిలిప్పైన్ యుద్ధాలలోనూ మెకార్థర్ శత్రుసేన తక్కువవుందనీ, అమెరికన్ బలం ఇట్టే జయిస్తుందనీ చెప్పి సాహసాలకి దిగాడు. కాని ఇతని లెక్కలు తప్పడం కొన్నిచోట్ల పరాజయం, కొన్నిచోట్ల చావుతప్పి కన్నులొట్టపోవడం సంభవించాయి. అలాగే కొరియాలో ఉత్తర కొరియన్లని 38 వ అక్షాంశానికి ఉత్తరంగా తరిమివేసినతరవాత, ఉత్తరకొరియాని కూడా ఆక్రమించుకోవాలని సూచిస్తూ, చీనా జోక్యంచేసుకోదని ట్రూమన్‌కి మెకార్థర్ వేక్ ద్వీపం సమావేశంలో చెప్పాడట. ఇప్పుడు మంచూరియాపైనా, చీనా తీరంపైనా దాడిచేసినట్లయితే రష్యన్లు జోక్యం చేసుకోరని అతని అభిప్రాయంట. ఈమారు అతని మాటల్ని ట్రూమన్ నమ్మలేకపోయాడు.

ఇప్పుడు మెకార్థర్ బర్తరఫ్ వల్ల కొరియాగురించి అమెరికన్ ప్రభుత్వం వైఖరి ఏమీ మారదని ట్రూమన్ స్పష్టపర్చారు. ట్రూమన్-అట్లీలు కలిసి చేసిన ప్రకటనలో ముఖ్యాంశాలకే కట్టుబడిఉంటారు చీనాపైన దురాక్రమణ నేరాన్ని మోపిన సమితి తీర్మానంలో అంశాలే వీరి విధానాన్ని నిరూపిస్తాయి. ఈ విధానంలో ముఖ్యాంశాలేవంటే 1. దురాక్రమణపరుల్ని క్షమించరు. 2. యుద్ధాన్ని కొరియాకే పరిమితం చేస్తారు. (మంచూ

# ★ డైరీ ★

### సోమవారం, ఏప్రిల్ 9:

—కొరియాలో సరిహద్దుకి ఉత్తరాన సమితిసేనలను నిరోధించడానికి కమ్యూనిస్టులు హ్వాచోన్ రిజర్వాయిర్ నీటిని విడిచి వరదలు పుట్టించారు.

—విద్యాసంస్థలలో విద్యార్థులను ప్రవేశపెట్టడానికిగాని, ఉద్యోగాలివ్వడానికిగాని మద్రాసుప్రభుత్వం అనుసరిస్తున్న కుల నిష్పత్తి విధానం రాజ్యాంగ నియమాల ప్రకారం అక్రమమని సుప్రీం కోర్టు తీర్పు నిచ్చింది.

—బాంక్ ఉద్యోగుల వృత్తి సౌకర్యాలను గురించి విచారించిన ట్రిబ్యునల్ సక్రమమైనది కాదనీ, అందువలన ఆ ట్రిబ్యునల్ చేసిన నిర్ణయాలు చెల్లనేరవనీ సుప్రీంకోర్టు తీర్పు నిచ్చింది.

—కార్డులు, కవర్ల వెల మినహా మిగతా తపాలా, తంతి, టెలిఫోన్ రేటు పెంచడానికి నిర్ణయించినట్లు మంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్ పార్లమెంటులో ప్రకటించారు.

—వరి సాగుచేసిన భూమిపరిమాణం గత సంవత్సరంకంటె ఈ సంవత్సరం తగ్గిందని మద్రాసు ప్రభుత్వపు సలహాదారు ప్రకటించారు. 1950 - 51 లో సాగుచేసిన భూమి 1,01,26,000 ఎకరాలు. 1949-50 లో సాగుచేసినది 1,5,98,544 ఎకరాలు.

—ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీచేస్తున్న మంత్రి శ్రీ నీలం సంజీవిరెడ్డిగారు, కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గం ఆదేశాన్ని అనుసరించి మంత్రి పద రాజీనామా నిచ్చారు.

—దేశంలో మద్యనిషేధం ఎలా అమలు జరుగుతున్నదో పరిశీలించడానికి మద్రాసు ప్రభుత్వం ఒక కమిటీని నియమించడానికి నిశ్చయించింది.

—కాంగ్రెస్‌వాదుల క్రమశిక్షణ వర్తన గురించి కేంద్రకాంగ్రెస్ కార్యవర్గంచేసిన తీర్మానం కాంగ్రెస్ సిద్ధాంతాలకు, ఆశయాలకు విరుద్ధంగా ఉన్నదని ఆచార్య కృపాలనీ విమర్శించారు.

—మహాభారత కాలంనాటి చరిత్రను నిరూపించడానికి హస్తినాపురంలో ఆధారాలు దొరికినట్లు పురావస్తుశాఖ ప్రకటించింది.

### మంగళవారం, ఏప్రిల్ 10:

—రూపాయి మారకపు విలువను పెంచడం మేలుకాదనీ, ఇప్పుడట్టి ఉద్దేశం భారతప్రభుత్వానికి లేదనీ మంత్రి సి. డి. దేశముఖ్ పార్లమెంట్‌లో చెప్పారు.

—బ్రిటిష్ ప్రభుత్వం బడ్జెట్‌లో 149 కోట్ల పౌనులు ఖర్చు దేశరక్షణకింద ఏర్పాటయింది. దాదాపు అన్నిరకాల పన్నులూ హెచ్చించబడినాయి.

—తుంగభద్ర ప్రాజెక్టువల్ల 60 వేల కిలోవాట్లు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి రు $4\frac{1}{2}$ కోట్ల ఖర్చుతో ఒక కార్యక్రమాన్ని హైదరాబాద్ ప్రభుత్వం తయారుచేసింది.

—ఇటీవల జనాభా లెక్కలప్రకారం చెన్నరాజ్యం జనాభా 5,69,52,332 అని తేలింది.

### బుధవారం ఏప్రిల్ 11:

—కులనిష్పత్తి విధానాన్ని నిలుపుకోడానికి రాజ్యాంగంలో సవరణ ప్రవేశపెట్టవలసినదిగా భారత ప్రభుత్వాన్ని కోరడానికి మద్రాసుప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు ప్రభుత్వాధికారి ఒకరు తెలిపారు.

—ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షులుగా ఎన్నికైనారు.

—జనరల్ మెకార్థర్‌ని సైనికాధికార పదవులన్నిటినుంచీ బర్తరఫ్‌చేస్తూ అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ అజ్ఞ ఇచ్చాడు. మెకార్థర్ స్థానే సమితిసేనల అధిపతిగాను, దూరప్రాచ్యంలోని మిత్రరాజ్య సైన్యాల అధిపతిగాను లెఫ్టినెంట్ జనరల్ రిడ్జ్‌వే నియమించబడ్డాడు. దీనివల్ల అమెరికా విదేశాంగ విధానంలో ఎట్టిమార్పు ఉండబోదని అమెరికన్ విదేశాంగ కార్యాలయం ప్రకటించింది.

—కొరియాలో సమితిసేనలు ఇంజిన్ నదిని దాటాయి.

—జపాన్ శాంతిసంధి సంప్రదింపుల్లో కమ్యూనిస్టు చీనానుకూడా చేర్చుకోవాలని బ్రిటిష్‌ప్రభుత్వం అమెరికన్ ప్రభుత్వాన్ని కోరింది.

—యుద్ధాన్ని కొరియాకే పరిమితం చెయ్యాలని అమెరికన్ ప్రభుత్వం చేస్తున్న కృషికి జనరల్ మెకార్థర్ తోడ్పడనందువల్ల అతన్ని బర్తరఫ్ చేసినట్లు ట్రూమన్ ప్రకటించాడు. అమెరికా విదేశాంగ విధానంలో మార్పుండదనికూడా ట్రూమన్ చెప్పాడు.

—మెకార్థర్‌ను భర్తరఫ్ చేసినందుకు ట్రూమన్‌ను కాంగ్రెస్ విచారించాలని ప్రకటించిన రిపబ్లికన్ పార్టీనాయకులు తమ ప్రయత్నాన్ని విరమించుకున్నారు.

### గురువారం, ఏప్రిల్ 12:

—అమెరికన్ దేశ రక్షణ శాఖవారి ఆజ్ఞలను తానుల్లంఘించలేదని జనరల్ మెకార్థర్ అన్నాడు.

—కొరియాలో పెద్దవిమాన యుద్ధం జరిగిందనీ, ఇంతటి విమానబలాన్ని కమ్యూనిస్టులు ప్రయోగించడానికి ఇదే ప్రథమమనీ కొరియాలోని అమెరికన్ సైనిక కార్యాలయం ప్రకటించింది.

—మొరాకో దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలని సూచిస్తూ నాలుగు అరబ్ రాజ్యాలు ఇరాక్, జోర్డన్, సాదీఅరేబియా, సిరియా ప్రభుత్వాలు ఫ్రెంచి ప్రభుత్వానికి లేఖలు పంపాయి.

—ఖాట్మండులో గూర్ఖాదళంవారుతమ నాయకుని విడిపించి, ఆంతరంగిక శాఖా మంత్రి బి. పి. కోయిరాలాగారి ఇంటిపై దాడి చెయ్యడానికి ప్రయత్నించినప్పుడు పోలీసు కాల్పులవల్ల ఇద్దరు మరణించారు.

—కాంగ్రెస్‌ను విడిచిపెట్టి ప్రజాపార్టీ అని ఒక కొత్తపార్టీని స్థాపించడానికి నిశ్చయించినట్లు ప్రకాశం, రంగాగార్లు ప్రకటించారు.

—కాంగ్రెస్‌లో ఐక్యత సాధించడానికిగాను కాంగ్రెస్ అధ్యక్షుడు టాండన్, ప్రధాని పండిట్ నెహ్రూ, మంత్రులు రాజాజీ, ఆజాద్ గార్లు ఆచార్య కృపలానీతో సమాలోచనలు ప్రారంభించారు.

—దక్షిణ పర్షియాలో ఆయిల్ రిఫైనరీలలో సమ్మె ఫలితంగా దొమ్మీలు జరిగాయి. ఇద్దరు బ్రిటిష్‌వారు ఒక ఇటాలీయన్ మరణించారు.

—చెన్నరాజ్యంలో ఎడ్వైజరీ కమిటీ సూచనల ప్రకారం దాదాపు 40 మంది కమ్యూనిస్టు నిర్బంధితులు విడుదల చెయ్యబడ్డారు.

---

రియాపైన దాడులు జరపనివ్వరు.) సమితి రాయబారసంఘం ఒకవంక, శిక్షు నిర్ణయసంఘం ఒకవంక ఎప్పటిలాగే పనిచేస్తూ ఉంటాయి. ఈ తీర్మానం అమల్లోఉన్నంతవరకూ శాంతిగురించి మాట్లాడరని పెకింగ్ ప్రభుత్వం స్పష్టపరిచింది. చీనాతో రాయబారాలు ఫలించకపోతే చర్యలు తీసుకోవాలనే బ్రిటన్ అమెరికాల యత్నం. ఇందులో మార్పేమీ ఉండదు. ★

**శుక్రవారం, ఏప్రిల్ 13 :**

—జపాన్‌తో శాంతి సంధి సమాలోచనల్లో కమ్యూనిస్టుచీనాకు ప్రాతినిధ్యమివ్వడానికి అమెరికన్ ప్రభుత్వం అంగీకరించబోదని అమెరికన్ సహాయ విదేశాంగ మంత్రి ప్రకటించారు.

—అమెరికన్ విమానాలు మంచూరియాలో ఒక పట్టణంపై దాడిచేసినట్లు పెకింగ్ రేడియో ఆరోపించింది.

—దూరప్రాచ్యంలో అమెరికన్ విదేశాంగ విధానాన్ని గురించి మెకార్థర్ అభిప్రాయాలను తెలుసుకోడానికి గాను కాంగ్రెస్ లో ఉపన్యసించవలసిందిగా ఒక సెనేట్ కమిటీ మెకార్థర్‌ను ఆహ్వానించింది.

—ఇరాన్ ఆయిల్ పరిశ్రమల్ని జాతీయం చెయ్యాలని 18 మంది ఇరాన్ పార్లమెంట్ సభ్యులు సూచించారు.

—బరోడా మహారాజాను మహా రాజ పదవినుంచి భారతప్రభుత్వం తొలగించింది.

—షోబుల్లా హత్యకేసులో ఖాసిం రజ్వీపైన తేబడిన అభియోగం సవ్యంగా లేదని చెప్తూ అతనిపై శిక్షను హైదరాబాద్ హైకోర్టు రద్దుపరిచింది. బీబీనగర్ దోపిడికేసులో రజ్వీపైనా తదితరులపైనా శిక్ష ఖాయపరచబడింది.

—ఉత్తరబీహార్‌లో క్షామం వ్యాపిస్తున్నదనీ భారతప్రభుత్వంపక్షపాతం మాని తమకు అవసరమైన 20 లక్షల టన్నుల ఆహారం ఇవ్వాలని కోరుతూ బీహార్ శాసన సభ తీర్మానం చేసింది.

**శనివారం, ఏప్రిల్ 14 :**

—యం. యస్. యం. రైల్వే, యస్. ఐ. రైల్వే, మైసూర్ రైల్వేలో విలీనం చేసి స్థాపించిన దక్షిణరైల్వేకి మంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ ప్రారంభోత్సవం జరిపారు.

—భారతదేశం జనాభా మొత్తం 36 కోట్ల 18 లక్షలుపైగా ఉన్నట్లు సెన్సస్ కమీషనర్ ప్రకటించారు.

—భారతదేశంలో ఎన్నికలు నవంబర్, డిసెంబర్ మాసాలలో జరగడం ఖాయమేనని మంత్రి అంబేద్కర్ పార్లమెంట్‌లో ప్రకటించారు.

—అనారోగ్యంవల్ల మూడు మాసాలు సెలవు పెట్టిన అసఫ్‌ఆలీ స్థానే వి. పి. మీనన్ గారు ఒరిస్సా గవర్నర్‌గా నియమించబడ్డారు.

—బ్రిటిష్ కార్మిక నాయకుడు, ఇటీవలవరకూ బ్రిటిష్ విదేశాంగమంత్రీ అయిన ఎర్నెస్ట్ బెవిన్ మృతి చెందారు.

**ఆదివారం, ఏప్రిల్ 15 :**

—ఐక్యరాజ్య సమితి తమ సైన్యాలను కొరియానుంచి ఉపసంహరించుకుని శాంతిని స్థాపించాలనీ, దురాక్రమణ నేరానికిగాను అమెరికానీ దక్షిణ కొరియానీ శిక్షించాలనీ కోరుతూ ఉత్తర కొరియా ప్రభుత్వం ఐక్యరాజ్య సమితికి విజ్ఞప్తి చేసింది.

—ఉద్యోగులు, కార్మికుల సమ్మెవల్లనూ అశాంతివల్లనూ ప్రపంచంలోకెల్ల పెద్దదైన అబడాన్ ఆయిల్ రిఫైనరీ యంత్రాలను (దక్షిణ పర్షియా) ఆంగ్లో ఇరానియన్ ఆయిల్ కంపెనీవారు మూసివేశారు.

—శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు విశాఖపట్నం మున్సిపల్ చైర్మన్ పదవికీ, మద్రాసు శాసనసభ సభ్యత్వానికీ, కాంగ్రెస్ సభ్యత్వానికీ రాజీనామా నిచ్చారు.

—స్థానిక సంస్థల ఆర్థికస్థితి పరిశీలక సంఘ నివేదిక భారతప్రభుత్వానికి సమర్పించ బడింది. ★

---

"అబ్బీ, సారపిండె ఒకటి కావాలి ఉందా?"

"ఆ కనపడే పిండె ఇస్తునా?"

"ఎంత?"

"ఓకానీ ఇవ్వండి."

"ఇంద కానీ. కొయ్యకు. పది హేను రోజులకి మళ్ళీ వచ్చి పట్టుకెళ తాను"

* * * *

మేస్టరు: నీరు మంచుగడ్డ అయితే జరిగే పెద్ద మార్పేమిటిరా?

విద్యార్థి: ధర హెచ్చుతుందండి సార్.

* * * *

"లోకంలో ఎటువంటి దగుల్బాజీ లున్నారనీ! పాలవెధవ చెల్లని అర్ధరూపా యిచ్చాడు"

"ఏదీ?"

"ఇంకా ఉందీ? అప్పుడే చాకలాడి కంట గట్టేశాను."

* * * *

"ఈసూర్యాస్తమయ దృశ్యం నాకుమార్తె చిత్రించింది. అది విదేశాలలో చిత్రలేఖనం నేర్చుకొచ్చింది."

"అలాచెప్పండి. ఈ దేశంలో ఇలాంటి సూర్యాస్తమయా లెక్కడివీ?"




## 1

పేరు చదవగానే నామీద విరుచుకుపడకండి, ఈయన ఈ దురాచారాన్ని ఈ శతాబ్దంలో ప్రచారం చేస్తున్నాడేమిటా? అని. కథంతా పూర్తిగా చదివినా, ఆగ్రహం పోకపోతే, నాదే తప్పని నేనే ఒప్పుకుంటాను.

ఐరనీ గ్రేసుని ఎరగనివాళ్లెవరూవుండరు, మా కాలేజీలో పదేళ్లు, ఈమధ్య చదివిన వాళ్లు. పేరుకు తగిన గ్రేసూ, అందం; అల్లరి విద్యార్థులకు తగిన యినుప (ఐరనీ) తత్వం అన్నీ ఆవిడకి పలుకుబడిని తెచ్చాయి.

తురంగరావెప్పుడో ఆవిడమీద మనసుంచాడు. కాని ఎదురుకుండా వెళ్లి 'నన్ను పెళ్లి చేసుకో; నా సర్వస్వాన్నీ నీకర్పిస్తాను' అనే ధైర్యం అతనికి లేదు; వేరేవిధంగానూ, తన ప్రేమని ఆవిడకి వెల్లడించలేక పోయాడు. తక్కిన విద్యార్థుల్లా అల్లరి మొదలెడితే చులకనగా చూసి ద్వేషిస్తుందేమోనని భయపడసాగాడు.

ఒకరోజున గ్రేసు మేడమెట్లమీద పైకి వొస్తోంది. అతనూ అనాలోచితంగా వొచ్చి నట్టు వెనకాల పడ్డాడు. తెల్లని చీర, పొడుగాటి జెడ, రెండు చామంతిపువ్వులు, నల్లని సిల్కు రిబ్బను! అతని మనస్సు చలించింది. జడ పట్టుకుని కిందికి లాగాడు.

గ్రేసు ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది. అతను న్యాయాధిపతి ముందు నిలుచున్న నేరస్తుడిలా బిక్కమొహంతో చూశాడు. ఇంకా, కిందనించి వొచ్చే లెక్చరర్‌ని ఆవిడ చూసింది. మాట్లాడకండా ఆడపిల్లల గదిలోకి పోయింది.

తర్వాత లెక్చరర్‌ని చూసిన తురంగరావు గుండె దడపట్టుకుంది. ఎందుకో జ్వరం తగిలినట్టయింది. క్లాసురూంలో ఏదో బాధపడుతూ కూచున్నాడు. కాని ఒకందుకు అతనికి సంతోషంగా వుంది. గ్రేసు కసరలేదు; తిట్టాలేదు. కాని ఆచూపు అర్థంకాలేదు.

లెక్చరర్ ప్రిన్సిపాల్‌కు చెప్పడంతో ఈ వార్త కాలేజీ అంతా వ్యాపించింది. కొందరు విద్యార్థులు, అతన్ని నేరస్థుని లాగా, కొందరు హీరోలాగా చూడసాగారు. ఇతన్ని సస్పెండ్ చేస్తారనీ, డిస్మిస్ చేస్తారనీ, టి. సి. ఇచ్చి పంపిస్తారనీ అందరూ, అన్నివిధాలా అనుకోసాగారు. అన్నీ విన్నాక తురంగరావు చెడ్డకే తయారయ్యాడు.

ప్రిన్సిపాల్ తురంగరావుకీ, ఐరనీగ్రేసుకీ కబురంపాడు. లెక్చరర్ కూడా అక్కడే వున్నాడు.

"ఈ అబ్బాయి నీ జడ లాగాడా?"

ప్రిన్సిపాల్ అడిగాడు. గ్రేస్ ఒకసారి ఆలోచించింది. అతని ముఖంలోకి చూసింది. తర్వాత లెక్చరర్‌నీ, ప్రిన్సిపాల్‌నీ చూసింది. కాని ఏం మాట్లాడ్లేదు.

"ఏం? చెప్పవేం?"

ప్రిన్సిపాల్ రెట్టించాడు.

"లేదు" అంది గ్రేసు; ఒక విద్యార్థి భవిష్యత్ కోసం చిన్న అబద్ధం ఆడింది.

"అబద్ధం చెప్పకు; నేను నా కళ్ళతో చూశాను" అన్నాడు లెక్చరర్.



"మీ శీలం చూసి ఏమనుకున్నారో, ఈ సంగతిమాత్రం శుద్ధ అబద్ధం" అంది గ్రేసు మళ్ళీ.

లెక్చరర్ ముఖం మాడింది.

ప్రిన్సిపాల్ "ఏమండీ, చత్వారంకాని రాలేదుకదా?" అని, వాళ్ళతో "మీరు క్లాసులకి వెళ్లొచ్చు" అన్నాడు. తర్వాత ఆయన్ని బాగా దులిపాడుట.

## 2

కాలేజీ వదిలిపెట్టేక ఇంటికి వెడుతో, చాలాదూరంవరకూ తన్ను తురంగరావు అనుసరిస్తున్నది గ్రేస్ గుర్తించనేలేదు. తర్వాత అతనొక చిన్న దగ్గు దగ్గాడు. ఆవిడ వెనక్కి చూసింది.

"ఎవరూ? మీరా?" అంది చిరునవ్వు నవ్వుతూ. వాళ్ల ఇల్లు వొచ్చింది అంతలోకి.

"మీ సహాయం...!" అని తురంగరావు ఏదో చెప్పబోయాడు.

"లోపలికి రండి" అంది గ్రేస్. అతనికి అర్థం కాలేదు. కాని అతను బదులు చెప్పక అనుసరించాడు.

చిన్నయిల్లు! ముందర వరండా కర్రల కటకటాలతో వుంది. రెండు ఫేముకుర్చీలు, చిన్న టేబిల్, ఎదురుగుండా షెల్ఫ్‌లో పుస్తకాలు, ఇల్లు చాలా పరిశుభ్రంగా వుంది. బయట చిన్న పువ్వులతోట వుంది క్రిష్టియన్ ఫాషన్‌లో.

ఇద్దరూ కుర్చీలో కూచున్నారు.

"మధ్యాహ్నం ఎందుకలా చేశారు?" ఐరనీ గ్రేస్ అడిగింది. అతను దీనంగా చూడసాగాడు. ఆమె మళ్ళీ, "కింద లెక్చరర్ వొస్తున్నాడని వూరుకున్నాను. కాని లేకపోతే....."ఏమో అనబోయింది.

"నాకు తెల్సు. మిమ్మల్ని కాలేజీలో చేరినదగ్గర్నించీ చూస్తున్నాను. నాకు ఎనో అగాధమైన ప్రేమకలిగింది, మీమీద! క్లాసులో మీకేసే చూస్తుంటాను. మీకు తెలీయకండా, సామీప్యంనించి మిమ్మల్ని గమనించడానికని, చాలాసార్లు కావాలని నడిచాను. మీతో చాలాసార్లు మీ యింటి వరకూ కూడా నడిచాడు. కాని నా ప్రేమా ప్రయత్నం మీ దృష్టిని ఆకర్షించ లేక, పోయాయి. ఈ వేళ ఎందుకనో తెలీదు. నన్ను నేనే మర్చిపోయాను. మిమ్మల్ని తాకుతే జీవితాని కదే చాలేమో ననిపించింది..." అతనికి ఆవేశంలో గొంతు పూడిపోయింది. తక్కింది కళ్లతో చెప్పాడు.

ఐరనీ గ్రేస్ మొదట నవ్వు వొచ్చిం. కాని తర్వాత అతనికి ఆవేశాన్ని గుర్తించింది. అతను మౌనంగా కళ్ళతో ప్రేమని కురిపిస్తున్నాడు.

"మగవాళ్లు, పాపం, ప్రేమ ఎక్కువైనప్పుడు ఇల్లాగే పిచ్చిపాపలైపోతారు" సానుభూతితో నవ్వింది.

అతనేం మాట్లాడ్లేదు, 'నవ్వేతున్నా అనుకో, నాకు కావల్సింది, నీ ప్రేమ మాత్రం' అనుకుని.

గ్రేసు తల్లి రెండు కప్పులు టీ యిచ్చింది. మళ్లీ లోపలపనిలోకి పోయింది.

టీ తాగాక, గ్రేసు అంది: "నాకు పిచ్చిప్రేమల్లో నమ్మకంలేదు; చేసుకుంటే పెళ్లిచేసుకోవాలి, అంతే!"

అతని ముఖాన్ని పరిశీలనగా చూడసాగింది. అతని ముఖం విప్పారింది. సంతోషంతో కళ్లు నాట్యం చేయ సాగాయి!

"అబ్బ! నా జన్మ తరించింది. ఇంక

నాకు జీవితంలో కావల్సిందేమీ లేదు. ప్రేమ ఫలించింది” అరిచాడు.

ఐరనీ గ్రేస్ అందుకుంది: “మన సమాజాన్ని, అందులో మా సమాజాన్ని కొంచెం గుర్తుకు తెచ్చుకోండి. మీ రేమో ఉత్తమకులస్థులు మేం అధో జాతి. మిమ్మల్ని, మీ కుటుంబాన్ని వెలి వేస్తారు. మిమ్మల్ని ఇంటినుంచి తరిమేస్తారు, ఈ భౌతిక బాధల్ని భరించలేక మీరు కొన్నాళ్లు పోయాక వేరేదారి తొక్కుతారు. నేను నమ్మలేను— మనం సంతోషమైన జీవితం గడుతామని! ఇలాంటి ప్రేమలు కల్సి, జయించి సుఖంగా వున్న వ్యక్తులు ఏకోటిలో ఒక్కరో” అంది.

అవును; ఆ విడ చెప్పినదాంట్లో అబద్ధం లేదు. మన దేశంలో వివాహాలు జరిగేది ప్రేమనిబట్టి కాదు; పెద్దల నిశ్చయాన్ని బట్టే గా. ఒక వేళ ఏవరైనా ఈ సంఘదురన్యాయానికి ఎదురు తిరిగి ప్రేమిస్తే వాళ్లని నానాహింసలూ పెట్టడానికి చూస్తారు, సంస్కారులమని చాటుకునే పెద్దమనుషులతో సహా.

అతను లేచి రెండుచేతులూ పట్టుకుని అన్నాగాడు. “నన్ను నమ్మ, ఈ వేళనించి నేను ఇక్కడే వుంటాను, నా యింటికేపోను. అప్పుడైనా నమ్మకం కలుగుతుందా? తర్వాత మా ఇంటి వైపునించివొచ్చే ఎటువంటి ప్రతిఘటనైనా నేను ఎదుర్కొంటాను. లేకపోతే వాళ్లతో సమ్బంధమే వుంచను. ఇంత చదువు చదివినమనం సుఖంగా వుండలేకపోం. ఎక్కడో ఏదో వుద్యోగం చేసుకుని హాయిగా వుందాం. నామాట న[illegible] అతని కళ్లల్లో ఆనంద బాష్పాలు! ఐరనీ గ్రేసుకీ అంతే! మాటరాలేదు.

తల్లివొచ్చి గుమ్మందగ్గర నుంచుంది.

“మీ అల్లుడు!” అని ఐరనీ గ్రేసు, అతన్ని లేవతీసి, తల్లికి చూపింది.

తల్లి ముక్కుమీద వేలేసుకుంది, వాళ్లిద్దరూ ఆమెకి నమస్కరించారు, ఆశీర్వదించమని.

## 3

ఇది జరిగిన రెండేళ్లలో వాళ్ల జీవితంలో చాలా మార్పులు జరిగాయి. కాని తురంగరావు ఆమెని విడవా లేదు. గ్రేసు అతన్ని అంతకంటె గట్టింపు ప్రేమతోనూ చూసుకుంది. తల్లిమాత్రం చనిపోయింది.

కాని బాహ్యపరిస్థితులు వాళ్లకి చాలా ప్రతికూలమయ్యాయి. అతనితల్లీ, తండ్రీ ఐరనీ గ్రేసు ఇంటికి వూళ్లోని పెద్దమనుష్యుల్ని తీసుకొచ్చి ‘అతనికీ, ఆమెకీ’ బుద్ధిచెప్పించడానికీ, అతన్ని తీసుకువెళ్లడానికీ ప్రయత్నించారు. కాని అతను లొంగలేదు. తండ్రి “ఆస్తి ఇవ్వ” నని బెదిరించాడు.

“కూడా స్వర్గానికి తీసుకెళ్లు!” అన్నాడు కొడుకు. “రాకపోతే ఉరిపోసుకు చస్తానంది” తల్లి.

“మమ్మల్ని విడదీర్చ రానియి” అన్నాడు కొడుకు.

“ఆ కిరస్థానీదాన్ని నా గడపతొక్కనియ్యను” అన్నాడు తండ్రి.

“మీ ప్రేమకి కులాలు, మతాలున్నాయి. మా ప్రేమకి లేవు. మమ్మల్ని సుఖంగా బ్రతకనియ్యండి” అన్నాడు కొడుకు.

ఐరనీ గ్రేసుకి వాళ్లమతంలోంచి వొత్తిడి వొచ్చింది.

“అతన్ని కూడా క్రిస్టియనుమతం తీసుకోమను” అన్నారు మతాధిపతులు.

“ప్రేమకీ, మతానికీ సంబంధమేమిటి?” అంది గ్రేసు; “మతం వ్యక్తిగతవిషయం”

అతని తండ్రి, తల్లి, పలుకుబడినీ విని రెచ్చగొట్టారు. చివరికి ఇంటివాళ్లుకూడా: “ఈ సంకరపు కాపరాలు’ మాకువద్దు ఖాళీచెయ్యండి” అన్నారు; వెళ్లగొట్టారు!

ఇద్దరూ ఒకరోజున ఆవూరువిడిచి దూరంగా వేరే పల్లెటూరు పోయారు. అక్కడ అతను ఒక సినిమాహాల్లో చేరాడు. గ్రేస్ చేతిమిషనీమీద గలేబులూ, అంగీకుట్టి రెడీ మేడ్ వాళ్లకి అమ్మేది. అతనికి రాత్రి ఆరు గంటలూ, తర్వాత పగలు రెండు గంటలూ పని వుండేది. తీరిక కాలంలో ఎంతో హాయిగా గడుపుతుండేవారు.

ఒకరోజు గ్రేసు ఏదో అల్లికలల్లుతోంది. తురంగరావు వెనకనించి వొచ్చి, జడలాగాడు. ఆవిడ వెనక్కి తిరిగింది. ముఖం కత్తివేటుకు నెత్తురుచుక్క లేకుండా అయింది! కుర్చీలోంచి లేచింది! అతనూ వెనక్కి తిరిగాడు. ఊపిరి ఆగినట్టయింది!

గుమ్మంలో లెక్చరర్! ఇద్దరూ ఒక క్షణం అయ్యాక తేరుకున్నారు. కాని ఆయనే ముందు మాట్లాడాడు.

“నన్ను చూసి భయపడకండి. అసలు

(21-వ పేజీ చూడండి)

కామోసు! పేరుప్రతిష్ఠలు పోయేక చేసేది ఏమీ లేదు. దీపమున్నప్పుడే ఇల్లుచక్కబెట్టుకోమని శాస్త్రం" అంది తులసెమ్మ.

"లేకపోతే అదికాస్తా అరిపోయేక ఎవరిదారి వాళ్ళది" అన్నాడు సన్నిధిరావు.

"పోనీ ఎప్పటికేనా కాస్త జ్ఞానం వస్తుందేమో అని చూస్తున్నాను! 'అత్తగారు' అని మన్నాపన సరేలేదుకదా, అసలు పిలవడమే అరుదయిపోయింది. ఇహ మన్నాపనగౌరవ ఏమివచ్చె!" అంది తులసెమ్మ.

"మనం ఎవరమన్నా కోపమే నే! ఎప్పుడూ పీకవరకు ఉంటుంది అదేం పాపమోగాని!" అంది కూతురు, తనచేతితో తన పీకపట్టుకొని అభినయిస్తూ.

"చెప్పకుండా రాత్రుళ్లు కాస్తకాళ్లు పిసుకుతుందేమోఅని వచ్చినప్పటినుంచి చూస్తున్నాను!" అంది అత్తగారు.

"పీక పిసకకుండాఉంటే కాళ్లు పిసికినంతఫలం!" అందికూతురు.

"ఆ! అన్నిటికీ తెగించినదేలే!" అంది అత్తగారు.

"అంతపనీ చేసే మనిషే!" అంది సింగమ్మ.

"సరే! మొదట చెప్పి చూడు!" అన్నాడు సన్నిధిరావు.

"చెయ్యకపోతే తడిపిడిలగ్గం తాతకి పెళ్లి జరగనే జరుగుతుంది!" అంది కూతురు.

"ఈ రోజు లగాయతురాత్రి పదిగంటల దాకా నన్నడగందే నీ మొగుడితో మాట్లాడకూడదు! ఏమి విన్నావా?" అంది అత్తగారు.

"ఊఁ" అంది రామామణి.

"నోరు ఏమయిపోయింది. నోట ఇప్పుడు కబుర్లు రావేమో!" అంది అత్తగారు హేళనగా.

"అలాగేదో నిష్కర్షగా చెప్పిచూడు. అంతేగాని ఉత్తమాటలెందుకు ఊపిరి దండగ" అన్నాడు సన్నిధిరావు.

"పోనీ పిల్లకదా దానికదేబుద్ధి తెచ్చుకుంటుందేమోఅని నేనూ చూస్తున్నాను!" అన్నాడు కొడుకు.

"పిల్ల! పాపం చిన్నకూచి! ఇంకా తల్లిపాలు విడవలేదు!" అంది సింగమ్మ.

వంటింటిలో పని పాట్లకి పోయింది రామామణి. మరి కాస్తసేపు ఆ అమ్మాయిని గురించే మాట్లాడుకొని సభ చాలించారు.

ఇంకొకరోజున సన్నిధిరావు డిస్ట్రిక్టు కోర్టుకి పనిమీద వెళ్లాడు. కొడుకు ఇన్‌స్టిట్యూట్‌కి చదువుకి వెళ్లాడు. రామామణి వంటఇంటిలో గిన్నెలు తోముతూండగా అత్తగారు, ఆడపడుచు వచ్చారు.

"ఇంకా నీకు ఎప్పుడు తెలుస్తుంది. ఆచారంగా చెయ్యాలని. ఈజన్మలో తెలుస్తుందా?" అంటూ అత్తగారు, కోడలి బుగ్గలు పట్టుకొంది.

"ఇహ తెలియడమే! పుల్లలతో తెలియవలసిందే!" అంది ఆడపడుచు.

"ఏమీ! ఆ నోటమాటరాదేం!" అంది అత్తగారు.

"తోముతున్నాను" అని జవాబు చెప్పింది కోడలు.

"నాకు కళ్లుపోయేయనుకున్నావేమిటి! నీ కర్మమా అంటూ ఇంకా అంతమట్టుకు రాలేదు!" అంది తులసెమ్మ.

"చూడు దాని పొగరుబోతుతనం!" అంది సింగమ్మ.

"ఒళ్లు వాయగొడతాను. ఇంకా నా సంగతి ఎరగవు!" అంది తులసెమ్మ.

"ఎలా చూస్తుందో చూడమ్మా!" అంది సింగమ్మ.

"చూస్తుంది! చూడకేం! దీని గుడ్లుమూడ! ఇది ఎవర్నెల్లనుకొంటూందో!" ఏమిటో! అంది అత్తగారు.

"నవ్వు మెత్తమెత్తగా ఊరుకుంటూంటే ఇది దాని ఇదే!" అంది కూతురు.

రామామణి మళ్లీ పనికి కూర్చోబోగా చేతిలో చెంబు జారికింద పడింది.

"అయ్యయ్యయ్యో! చెంబు పగిలిపోయింది. ముక్కలయిపోయింది!" అంది తులసెమ్మ.

"చూడు దాని గీర్వాణం" అంది సింగమ్మ.

దీని గీర్వాణం వదిల్చేస్తా అంటూ!" తులసెమ్మ చీపురుకట్టతీసికొని కోడలిని రెండు బాదింది.

రామామణి గుడ్లనీరు కుక్కుకుంది.

"వచ్చినట్లు నోరుమూసుకో! నోరు ఎత్తేవంటే వెలక్కాయి పెచ్చులలాగు దవడలు నొక్కేస్తా!" అంది అత్తగారు.

"ఊరుకొంటుందనుకున్నావు పాపం! నీ తెలివితక్కువగాని!" అంది సింగమ్మ.

"ఊరుకోక ఏమిచేస్తానమ్మా!" అంది రామామణి.

"నామీదకూడా తిరగబడుతున్నా! నేను మీ అత్తగారినికాదు ముద్దియ్యడానికి! ఆడపడుచుని" అంటూ సింగమ్మ రామామణి బుగ్గలు పొడిచింది.

"ఇహ నీ అంతం చూస్తాను, ఈ మోస్తరుగా చేసేవంటే!" అని కోడలి వీపుమీద రెండు వేసింది అత్తగారు.

"ఎందుకూ మొగుడితో చెప్పి తేసరి!" అంది కూతురు.

"వాడో ఛవటపీనుగ! కాబట్టే దీని ఆటలు ఇలాగు సాగుతున్నాయి. వాడే చేతనయినవాడైతే నాకీ ఖర్మమేమి పట్టిందమ్మా. కొట్టికొట్టి చేతులు కాళ్లు నొప్పులు పెట్టి నేను ఏడుస్తూంటే!" అంది అత్తగారు.

"ఎవరిదారిని వారు వెళ్లిపోయేరు.

సాయంత్రం చెన్నారావు ఇంటికి వచ్చేటప్పటికి రామామణి తలకి గుడ్డకట్టుకొని పని చేసుకొంటూంది. కొడుకురాగానే అన్ని విషయాలూ చెప్పింది తల్లి. అతను "అందుకనా! సరిసరి! ఏమిటోఅనుకున్నాను! రోగంవచ్చినట్లు నటన! పాపం ఎవరేనావచ్చి బతిమాలుకొంటారనుకుంది కాబోలు! అంత వెర్రివాళ్లు ఈ కొంపలో లేరన్నసంగతి ఇంకా ఎరగదు పాపం!" అన్నాడు. ఇంతటిలో సన్నిధిరావు వచ్చాడు. సంగతిఅంతా తెలుసుకొని కోడలిమీద నాలుగు కేకలువేశాడు. రామామణికి దిక్కుతోచలేదు. ఉన్నసంగతి సందర్భాలన్నీ చాటుగా కాగితంమీదరాసి పోస్టుకవరులో పెట్టి పొరుగింటి స్నేహితురాలికి అందియ్యగా, ఆ అమ్మాయి పోస్టుపెట్టెలో పడవేసింది.

ఒకరోజు మధ్యాహ్నం పని అంతా చేసుకొని తీరుబాటుగా సావిటిలో కూర్చుంది బంగారమ్మ. పక్కనే వాలుకుర్చీమీద వాలాడు బలభద్రం.

"ఇల్లంతా చిన్నపోయింది పిల్ల వెళ్లిపోయేక!" అంది భార్య.

"ఆ! అలాగేఉంది!" అన్నాడు బలభద్రం.

"కిందటిమాటు పిల్లరాసిన ఉత్తరమే ఎంతసేపూ నాకు తలపుకి వస్తూంటుంది" అంది భార్య.

"ఉత్తరం ఏమీ విశదంగాలేదు." అని వ్యాఖ్యానించాడు భర్త.

"అంతా ఓర్చుకొంటూ, సంగతులు దాస్తూన్నట్టుగా కనబడుతూంది నాకు" అంది బంగారమ్మ.

ఆమె అభిప్రాయంతో ఏకీభవిస్తూన్నట్లుగా ఊరుకొన్నాడు బలభద్రం.

"పోనీ ఒకమాటు బయలుదేరి వెళ్లివద్దామంటే వర్షాలొకటి! ఎడతెరిపిలేకుండా తినివేస్తున్నాయి! అష్టకష్టాల ప్రయాణం!" అంది భార్య.

"పనిఉంటే వర్షమని మానుకొంటావేమిటి!" అన్నాడు భర్త.

"ఇనెక్కడ వర్షాలోనమ్మా! ఏమీతోచనియ్యకుండా చస్తున్నాం! ప్రాణం ఎంతయినా ఎండకి ఓరుస్తుంది కాని వానకి ఓర్చదు" అని బంగారమ్మ అంటూండగా

వీధి గుమ్మంలో పోస్టుమాను నిలబడ్డాడు. బలభద్రం తొందరగా వెళ్లి సంచీ ఉత్తరం అందుకొన్నాడు. చింపి, ఉత్తరం తీసి "అమ్మాయిదగ్గిరనుంచి" అన్నాడు.

వినడానికి తల్లి తొందరపడింది.

బలభద్రం ఇలాగు చదివేడు" మహాలక్ష్మి సమానురాలైన మా అమ్మగారికి, నాన్నగారికి నమస్కారములు. అక్కడి క్షేమ సమాచారములు తెలియపరచవలెను. ఇక్కడి నా యోగక్షేమములనుగురించి వేరేరాయనక్కరలేదు. మా అత్తగారు ఆడపడుచు నన్ను ఇల్లు కదలనివ్వకుండా ఉన్నారు. ఇంటిలో పనివాళ్లు చెయ్యడమే మానివేశారు. ఏమిపొరపాట్లువచ్చినా అత్తగారు ఆడపడుచు నన్ను కొడుతున్నారు. మా మామగారు, మీ అల్లుడుగారుకూడ వాళ్లపక్షమే! వాళ్లకి తెలియకుండా ఈ ఉత్తరం రాసేటప్పటికి బ్రహ్మాండమైపోయింది. పక్క ఇంటిలోనున్న ఒక స్నేహితురాలిని ఈ ఉత్తరం పోస్టులో పడవెయ్యమన్నాను. నాకు దారి తెన్ను కనబడడం లేదు. మీ మొహాలు ఇహ నేను చూస్తానో చూడనో! ఇట్లు మీకుమార్తె రామామణి."

ఉత్తరంచూసి తల్లిదండ్రులు కొయ్య అయిపోయారు. కొంతసేపటికి గాని తండ్రి నోటమాటరాలేదు. తల్లి గుడ్లనీరు కుక్కుకుంటూ కూర్చుంది.

"ఇహ మళ్లీ మీ మొహాలు చూస్తానో చూడనో అని రాసింది బిడ్డ!" అని బలభద్రం కన్నీళ్లు కార్చాడు.

"బతకనిస్తారో బతకనియ్యరో ఆఖరికి!" అంది తల్లి కళ్లు తుడుచుకొంటూ.

"ఇంతమట్టుకు వస్తుందనికలలో కూడా అనుకోలేదు" అన్నాడు తండ్రి.

"తులసెమ్మ సంగతి ఎరిగిన వాళ్లందరూ అలాగే చెప్తారు!" అందిబంగారమ్మ.

"మన ఖర్మం కొద్దీ వచ్చింది ఈ సంబంధం! కాకపోతే మాణిక్యంలాంటి పిల్లని తీసుకువెళ్లి వాళ్లయడాన్ని పెట్టడమేమివచ్చె!" అన్నాడుభర్త.

"లేక లేక బిడ్డకలగడమేమిటి! మనకీ ప్రాయుద్ధమేమిటి!" అంది తల్లి.

బలభద్రం కళ్లనీళ్లు పెట్టుకొని ఆలోచిస్తున్నాడు.

"ఇంటిదగ్గిర పనివాళ్లని మానిపించేశారని రాసింది బిడ్డ! ఇంటి చాకిరీఅంతా దాని చేతే చేయిస్తున్నారేమోఖర్మం!" అంది బంగారమ్మ.

"ఇంటిలోపని అత్తగారు, ఆడపడుచు ముట్టుకోడం మానివేసి అంతా పిల్లచేతే చేయిస్తున్నారని దాని అర్థమనుకొంటాను" అన్నాడు బలభద్రం.

"ఏమో, తులసెమ్మ ఎంతకేనా తగును!" అంది భార్య.

"ఏమిటిదారి!" అన్నాడు బలభద్రం.

"గోదావరేదారి!" అంది భార్య.

"అలాగ అధైర్యపడిపోతే ఎలాగే! ఏదో అన్ని దోవలూ తొక్కిచూడాలి!" అన్నాడు బలభద్రం.

బంగారమ్మకి ఏడుపేగాని ఆలోచన తోచలేదు.

"తొందరపడి గంతులు వేసినంత మాత్రాన్ని వ్యవహారాలు చక్కబడతాయా ఏమిటి!" అని అతను ఒక్క పిసరు స్థిమితంగా ఆలోచించాడు.

"వియ్యంకుడిపేర ఒకఉత్తరం రాస్తాను. అల్లుడు మాయింటికివచ్చి చాలకాలమయింది. దసరాపండగలకి అల్లుడు అమ్మాయితో కూడ ఇక్కడికి వచ్చి నాలుగు రోజులుండి వెళ్లవలసింది అనికోరుతూ రాస్తాను" అన్నాడు బలభద్రం.

"వాళ్లు పంపవద్దూ!" అంది భార్య.

"అన్నీ మనమే ప్రశ్నించుకొని మనమే కాదు అనుకొంటే ఇహ దారేమిటి! కాబట్టి ఆమోస్తరుగా అడిగి సమాధానం ఏమివస్తుందో చూద్దాం!" అన్నాడు బలభద్రం.

"మనుష్యులనిబట్టి ఏమంటారో మొదటే చెప్పకో వచ్చుకదా!" అంది పెళ్లాం.

"సరే! ఆ ఉత్తరం ఆమోస్తరుగా రాసి మరొక పనిచేస్తాను" అన్నాడుబలభద్రం.

బంగారమ్మ ఆసక్తితో చూసింది.

"మా స్నేహితుడి ఇల్లు మనవాళ్ల ఇంటికి దగ్గిరలోనే ఉంది. అమ్మాయి పెళ్లికి వచ్చాడు. శోభనాచలం అన్న పేరు వింటూనే ఉన్నావు. నాకు బాగా స్నేహితుడు. అతను ప్లీడరుపనిచేస్తున్నాడు రాజమహేంద్రవరంలోనే! అతనినో లేక అతనివాళ్లనో పంపించి ఒకమాటు మనవాళ్ల ఇంటికివెళ్లి కొస్త యోగక్షేమాలు వాకబుచేసి రమ్మంటాను" అన్నాడు బలభద్రం.

"సరే!" అంది భార్య.

తాను చెప్పినప్రకారమే ఉత్తరాలు రాసిపడవేశాడు బలభద్రం. బిడ్డరాసిన వార్తవిన్నాక తలిదండ్రులమనస్సులు దిగులుగా ఉన్నాయి.

ఒకరోజున రామామణిఇంటిలో మినప పిండి విసురుతూంది. సింగమ్మ దగ్గరకి వచ్చింది. ఊళ్లోకబురు ఏదో చెప్పతుంది కామోను అనుకొంది రామామణి. కాని సింగమ్మ "మీ అమ్మకి- నాన్నకి ఒక్కపిసరేనా బుద్ధిలేదు" అంది.

"ఏమి?" అని అడిగింది రామామణి, పిండి విసరడంకొస్తసేపు కట్టిపెట్టి.

"ఎతసేపూ తమపిల్ల సుఖపడాలి, తమ పిల్ల కాపరంచెయ్యాలి అని ఆలోచనలే కాని ఎదుటివాళ్ల సంగతిఅక్కరలేదమ్మా! స్వలాభపరులు! స్వశ్రేయోభిలాషులు! వాళ్ళకి పుట్టిన చుప్పనాతివి నువ్వు! ఒకళ్లు సుఖపడిపోతారేమో అని ఏడుస్తావు నువ్వు! పోనీఇన్నాళ్లయిందికదా! సింగమ్మకి ఈసంబంధంచూసేను. ఇంతింత కట్నాలు అడుగుతున్నారు. ఇది మీకు ఇష్టమా, అయిష్టమా

(20-వ పేజీ చూడండి)

కథానిక:

# శేషప్రశ్న

శ్రీ క. జగన్మోహన్

"ఇది తనకున్న విస్తృతావకాశాల వల్ల నిర్లక్ష్యత కలిగి ప్రతీకార మను సల్ప నుద్యుక్తయైన ఒక విద్యార్థిని......" అంటూ ప్రారంభించే సరికి

"నేడు సభ్యతా ప్రపంచంలో కథల్లోను, కావ్యాల్లోను, ఆచరణలోను స్త్రీ నత్యున్నతస్థితికి గొంపోతున్నారు. ఇది చివరకు విషాదాంతమై ప్రాణసంకట మవగలదు. పెరుగుట విరుగుడకొరకే. మానవుడెంతో ఉచ్ఛస్థాయికి వెళ్లగలిగాడీ నాటికి నిత్య సంఘర్షణలో విజయాన్ని సాధించి. అడుగడుగునా సంకుచితభావాలుదయించే స్త్రీ, అంతఃపుర కాంతె ఉన్నతి నెట్లు సంపాదించుకోగలుగుతుంది? లేనిపోని ఘనత నాపాదించటం......"

"మానవుడు సభ్యత, విజ్ఞానా లంటూ మానవత్వపు శిఖరాగ్రంపై అధిష్టించాడు. కాని తరచి చూస్తే మానవత్వాన్నే మఱచి ఉచ్ఛనీచాల తారతమ్యం గమనించలేక పోతున్నాడు. శిఖరాగ్రంపై నుండి శిఖరం మొదలు చూడలేకపోతున్నాడు. అందుకే ఇంత పతనావస్థలో పడి కొట్టుమిట్టాడుతోంది మానవాళి. ప్రతి మానవునకు నరనారీ భేదంలేకుండా సమాన ప్రతిపత్తి సమాజంలో ఉంది. ప్రతివ్యక్తి పుట్టుకతోనే హక్కుల్ని పొందివస్తాడు. ఈ సత్యాన్ని గమనించికూడ చాలమంది స్వార్థసాఫల్యతకై నాగరికత ముసుగుతో కప్పజూస్తున్నారు." అన్నాడు కృపానందం రామారావు మాటను మధ్యలోనే అందుకుని.

"విమర్శలు - న్యాయాన్యాయ నిర్ణయాలు పాఠకుల్లో మునకన్న విమర్శనా దృష్టితో చేయగలివా రధికం. కథను ప్రారంభించి చదవండి." అన్నాడు కరీం విసుగ్గా వినాలనే ఆకాంక్షతో.

జీవితదశ లన్నింటిలోనికి విద్యార్థిదశే ఉత్సాహభరితము, స్వేచ్ఛ స్వాతంత్ర్యాలతో కూడి ఆనందప్రదమైనది. బాధ్యతలు, విచారాలు, వ్యథలు లేని సుఖప్రదమైన జీవితం. అందులో కాలేజీ వాతావరణం చాల సంతోషప్రదంగా ఉంటుంది. చూచీ చూపనట్లు చీరచెరగులు వదలి, మోముల నిండా మత్తైన సువాసనల నింపి, ఓరకంటి చూపులు చూస్తూ - ప్రకృతిసౌందర్యాన్నంతా పుణికి పుచ్చుకున్నట్లు చంచల చూపులతో ముగ్ధలై స్నిగ్ధహృదయుల జేస్తూ అణగని ముంగురులు చెదరి గర్వంతో నృత్యం చేస్తూ క్రొత్త సోయగాన్ని వ్వ సవిలాసంగా నడిచే విద్యార్థినులు - కనీసం ఒక్కరి కరుణాకటాక్ష వీక్షణాలనైనా చూరగొనలేమా అని గర్వంతో నడయాడే విద్యార్థులు మత్తైన సువాసనలతో నిండిన బరువైన గాలులు పీల్చుతూ సుఖస్వప్నాల్ని కంటూ ఊహాతీతమైన జగత్తులో విహరిస్తూంటారు. ఆడపిల్లల ఆరోగ్యాలుకూడ వి. సి, కాలేజి టవరులా నానాటికి క్షీణించి, నడుం సన్ననై హంసలవలె తేలిపోతూంటారు. గృహిణులంటేనే గృహానికి కళకాంతులు.

టయమయేటప్పటికందరూ తేనెటీగల్లా వారివారి క్లాసురూముల్లోనికి జొరబడ్డారు. విద్యార్థులముందే విద్యార్థినుల బెంచీలుకూడ ఉన్నై. కొద్దిసేపట్లోనే ఆవరణంతా శూన్యమై గదులు నిండిపోయినై. క్లాసంతా నిశ్శబ్దంగా ఉంది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ నిశిరాత్రిలో గుడ్లగూబ అరుపులా లెక్చరు వినబడుతోంది. తెలిసినా తెలియకపోయినా పరిపూర్ణంగా అర్థమౌతున్నట్లున్నై మోములు. వెనుక బెంచీలపై నిద్రాదేవితో ప్రేమకలాపాలాడేవారు, రాచకీయాలు చర్చించుకునేవారు, కణతలు పట్టుకు కూర్చునేవారు, క్లాసుకు ఎగనామం పెట్టేందుకు అదనుకై వేచియుండేవారు, ఇలా బహుముఖాలుగా తమ తమ పనుల్లో మునిగిపోయియున్నారు పోనుపోను క్లాసులో. విద్యార్థినుల బెంచీలకు వెనుకవైపు బెంచీలో రమేష్, సీతారామయ్య ఇంకా అతని మిత్రులిద్దరు కూర్చున్నారు. ఇంతలో ఒక విద్యార్థిని జడ ముందుకువేసి అలుకుంటోంది. అల్లికలో నిమగ్నమైన సరోజినికి లెక్చర్ వినబడటంలేదు. సీతారామయ్య ఇది జూచి రమేష్‌ని పేరు చూపమనేటప్పటికి సర్దుకుంటున్నట్లు లేచి కూర్చున్నాడు. రమేష్ లేవటం విద్యార్థినుల బెంచీలపై దృష్టి నిలపటం, క్లాసందరి దృష్టులు ఇతనిపైబడినై. ఈ విషయ మొక విద్యార్థినికూడ గమనించింది. కొద్దిసేపాగి "ఇది డ్రెస్సింగురూమా జడ లల్లుకోవటానికి?" అన్నాడు సీతారామయ్య లేచి లెక్చరర్‌తో. ఇంకేముంది క్లాసంతా గొల్లున నవ్వారు. నిద్రపోయేవాళ్లు త్రుళ్లిపడి లేచి చేత పుస్తకాలుబట్టి కళ్లు తుడుచుకుంటూ గొంతులు కలిపారు. విద్యార్థినులలో మాత్రం లజ్జావమానాలావరించినై. సరోజిని ముఖం జేవురించింది. కందగడ్డలాగైంది ముఖం. కళ్లు నిప్పులు చెరగుతోన్నై. క్లాసు అంతం వరకు వంచిన తలలు ఎత్తలేదు విద్యార్థినులు. విజయగర్వంతో కోలాహలంగా ఉంది విద్యార్థిబృందం.

చాలమంది విద్యార్థులు సీతారామయ్య నభినందిస్తుంటే విద్యార్థిను లందరూ సరోజినికి కల్గిన అవమానానికి కుపితలైరి. ఆరాత్రంతా సరోజిని మనసు బహుముఖాల పరుగులెత్తింది. అవమానంతో క్రుంగిన ఆమె మనసు కేంద్రీకృతమై ప్రతీకారానికి పరిపరివిధాల ఆలోచించి విసుగెంది ఎట్టి నిర్ణయం లేకుండగనే నిద్రపోయింది. మరురోజు క్లాసుకువచ్చేటప్పటికామె చిలిపిగా వెక్కిరించే నేత్రాలు ముకుళించుకుపోయి ఎఱ్ఱబడి వాచినై. కనురెప్పలు బరువుగా ఆడుతోన్నై. క్లాసంతా అఘోరకమైన వాతావరణంలో మునిగున్నది. అందరు తనను వెక్కిరిస్తున్నట్లుంది సరోజినికి. బెంచీపై కూర్చోగనే సుద్దముక్కతో తెల్లని "సరోజిని......" అన్న పెద్ద అక్షరాలు వ్రాయబడి ఉన్నై. సరోజిని తలవంచుకుని హతాశయై కూర్చుంది. లెక్చరర్ రాగనే విద్యార్థిను లందరూ చెప్పేటప్పటికి తిరిగి క్లాసంతా గొల్లుమన్నది. ఒకవంక అవమానంపై అవమానం - రెండోవైపు లెక్చరర్ మౌనం - సరోజినికి తలకొట్టేసి నట్లయింది. పుండుపై కారం చల్లినట్లయింది లెక్చరర్ యొక్క యీచర్య సరోజినికి. వెంటనే విద్యార్థినులలో గుసగుసలు, కల్లోలం బయలుదేరి పాఠం మధ్యలోనే వెళ్లిపోయారు విద్యార్థినులు. ఈ చర్య మొత్తానికి విద్యార్థులపై కొద్దిగా పనిజేసింది. నిశ్శబ్దంగా కూర్చున్నారు. అయినా ఆడ

పిల్లలు! లెక్చరర్‌కు భయమేసింది ప్రిన్సిపాలుకు రిపోర్టు చేస్తారేమోనని.

సరాసరి లేడీస్ వైటింగురూము లోకి వెళ్లి విమల, చంప, సరోజిని, హేమ మొదలుగాగల వారంతా సమావేశమై తీవ్రంగా చర్చిస్తున్నారు. చర్చలు జోరుగా సాగుతోన్నై. ముఖాలన్నీ కళావిహీనమై స్నో పౌడరు మిళితమైన చిరు చెమటలు కారి జిడ్డుగా ఉన్నై. దీనికంతటికీ కథానాయకుడు రమేషేనని ఉత్తేజంతో బల్ల గుద్దింది సరోజిని. రక్తనాళాలన్నీ ఉబికి ఎర్రవారింది ముఖం. ఇలాంటి తుంటరులకు కాడీలకు బుద్ధిగరపి సంస్కరించాలని, వెంటనే ప్రిన్సిపాలుకు రిపోర్టుచేయాలన్న నిర్ణయానికి ఏకగ్రీవామోదం పొందినై. పెద్ద చిక్కు సమస్యను పరిష్కరించినట్లయింది. బాధ్యతంతా తీరిపోయి నెత్తిపై బరువు దింపినట్లయింది. ప్రతి విద్యార్థిని మోములోను సంకోచం, కోపం ద్విగుణీకృతమౌతోన్నై. ఆరోజంతా సరోజిని క్లాసుకు వెళ్లలేదు. తిరిగి విద్యార్థినులంతా క్లాసుకు రాగానే కోలాహలంగా ఉన్న క్లాసంతా ఒక్కసారే వర్షం కురిసి వెలసినట్లయింది. నిశ్శబ్దంతోబాటు నిశ్చలదృష్టులన్నీ విద్యార్థినులపైబడి దహిస్తోన్నై. విద్యార్థినుల కితంతా అగమ్యగోచరమై తెల్లముఖాలు వేశారు. నిశ్శబ్దంగా అటీటు చూడకుండా చతికిల బడ్డారు. తిరిగి క్లాసంతా గొల్లుమంది.



దుర్భరావమానంతో సరోజినితో పాటు అందరు హాస్టలుకు వెళ్లిపోయారు. ఆ ఉదయమే సరిగా ఆహారాన్ని తీసుకోని సరోజిని రాత్రి అసలే తినలేదు. వార్డెనుకు తెలిసి సరోజినిగదికివచ్చి బ్రతిమాలంది భోంచేయమని. ఎన్నో విధాల తన అనులివాల మందును డోసులుడోసులుగా బలవంతాన త్రాగించింది. కొనది జబ్బును కుదర్చలేక పోయింది. రానంటె రానన్నది సరోజిని. "ఇంతవరకు తన తల్లిదండ్రులతోగూడ ఒక్కమాటైనా పడి యెరుగదు. అలాంటి తన ప్రసక్తి ఒకళ్లకెందుకు? ఇప్పటికే కాలేజీఅంతా మోగిపోతోంది. అందరినోళ్లలోను నానిపోతోంది. నన్నవమానించవలసిన అగత్యమేమిటి?" వీటన్నిటికి ప్రతిరూపం ఒక్క ప్రతీకారం మాత్రమే. కంటిపైరెప్ప బడలేదు. కళ్లువాచినై. ప్రక్కనున్న మిత్రురాండ్రు దూరడించిన కొలది అడ్డువేసిన చెరువునీరు కట్టలుదాటి పొంగినట్లు ప్రవహించసాగింది వెల్లువలైదుఃఖం.

కాలేజీ వార్షికోత్సవపురోజు దగ్గరకొస్తోంది. పనుల్లో నిమగ్నులై యున్నారందరు. ఉదయం టయమవగనే సరోజి చంప ప్రిన్సిపాలు రూము దగ్గర నిలబడ్డారు. ప్రిన్సిపాలుకు చంప నమస్కారం చేసింది. అడుగులో అడుగు వేసుకుంటూ చంప ననుసరించింది సరోజిని. ఆమె ముఖంపై శోకదేవత నృత్యచిహ్నాలింకా ఉన్నై అస్ఫుటంగా. జరిగిన సంగతి ప్రిన్సిపాలుకు నివేదించారు. ప్రిన్సిపాలుకు పచ్చినెలకొయ్య లాగైంది. తన ఒక్కడితో తేలిపోయేదిగాదీ సమస్య. వాళ్లిద్దరు "రమేష్‌ను వెంటనే కాలేజి నుండి స్వస్తి చెప్పించి, అతని అనుచరులను కనీసం పక్షంరోజులైనా సస్పెండు చేయమని, లేనిచో పరిస్థితులు మరింత క్లిష్టమై విషమరూపం దాల్చగలవని" విద్యార్థినులందరూ అంగీకారాన్ని తెల్పిన కాగితాన్ని ప్రిన్సిపాలు టేబుల్ పైబెట్టారు. ప్రిన్సిపాలుతోచకలేదు. ఇలాంటి ధక్కామొక్కిలెన్నో తన జీవితంలో అనుభవించాడు. నవ్వుతూ "సరే తెలుసుకుంటాను వెళ్లండన్నారు." కాని అలక్ష్యంచేయకుండా సత్వరమే చర్య తీసుకొనవలసిందని పట్టుబట్టారు. "ఒకపక్షంవాదన విని చర్య తీసుకుంటానని వాగ్దానం చేయటం సముచితం గాదు. ప్రతిపక్షం వాదనకూడ విన్న పిదప దానికి తగు చర్య తీసుకొనుట ఉచితమైన రీతి. లేనిచో అక్రమం, క్రమవిరుద్ధం గూడ." అన్నారు ప్రిన్సిపాలుగారు శాంతంగా. వాస్తవానికి రమేష్ చాల చురుకైనవాడు; మంచివాడు గూడ. కాలేజీలో ప్రథముడు. మంచిభావాలు గల ఇటువంటి విద్యార్థి అవకతవక పనుల్లో తలదూర్చుతాడని తాను అనుకోలేకపోతున్నారు. అలాంటి విద్యార్థి కాదనేది ఆయనకు రూఢిగా తెలుసు. ఏమో నమ్మకంపై విషాన్నైనా అమృతంలా త్రాగించవచ్చు.

మధ్యాహ్నం కమిటీ సభ్యులు, లెక్చరర్లు సమావేశమయ్యారు. వార్షికోత్సవ కార్యక్రమాన్ని నిర్వహించే విధం — వాటి ఖర్చులు మొదలైన చర్చలైన పిదప ప్రిన్సిపాల్ గారు ప్రస్తావనగా రమేష్ ప్రసక్తి తెచ్చారు. ఇంతలోనే మాథమాటిక్స్ లెక్చరరు లేచి "అతను స్వాంతవస్తుడని - తెలియని విషయాల్ని తెలుసుకోవాలనే ఆసక్తి ఉత్సాహాలు మెండని, అలాంటి విద్యార్థిపై నీచమైన నిందారోపణలు తగవని" అన్నారు. ఇంకో తెలుగు పండిట్ గారు పిలక సవరించుకుంటూ "అతనికి ఇతర విషయాల్లో పాత్ర బాగా ఉంటుందని అంతటి విద్యార్థి కాలేజీలో లేడని" అన్నారు. అతను వేసే చిక్కుప్రశ్నలే ఇంత కాకపడి మండిపోడానికి కారణం. ఇలాగే వారివారి కనుగుణంగా [illegible]ప్రాయాల్ని వెలిబుచ్చారు. తగిన గర్జనలైనవి. అతన్ని కాలేజీ నుండి తీసివేయుట మనే సమస్య మూర్తీభవించియున్న [illegible] బయట పెడుతోంది. సమావేశం స్తబ్ధతదాల్చింది. నిశ్శబ్దం [illegible]ంచింది. "ఉత్సాహంతో ముందడుగు వేసి కార్యదీక్షతో సఫలత గాంచుతున్నారు. తన పని జయప్రదంగా నిర్వహించుకోవేగుకు దృఢనిశ్చయంతో అడ్డుమొలకల్ని సమూలంగా పెరికి తన గమ్యానికి మార్గావరోధం లేకుండా సుగమ మొనర్చుకుంటున్నాడు. సద్భావం, సమరసం, సమత్వం అతనికి వన్నె దెచ్చినై. అలాంటివాడు తుచ్ఛపనులకొడిగట్టుతాడని

(22-వ పేజీ చూడుడు)



**సీరియల్ నవల:**

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 25

డాంటే ఉదయమే మేలుకున్నాడు. మేలుకుని లేచి, ద్వీపంలో కెల్ల ఎత్తైన కొండనెక్కి చుట్టూ చూశాడు. ఒక్క ప్రాణి కానరాలేదు. కొండ దిగివచ్చి గుహ ప్రవేశించాడు. వజ్రాలు, రత్నాలతోనూ, బంగారు నాణేలతోనూ జేబులు నింపుకున్నాడు. విరిగిన మూత సర్ది, పెట్టెని మన్నుతో కప్పివేశాడు. మట్టిని తొక్కి చదును చేశాడు. ఆనవాళ్లేవీ కనపడకుండా దాని పైన ఇసుక చల్లాడు. గుహ వెలుపలికి వచ్చి రాతిపలకతో ద్వారం మూశాడు. అది కనపడకుండా దానిపై రాళ్లు పరిచి, రాళ్లమధ్య మట్టిపోశాడు. ఆపైన గడ్డినారు, దుబ్బుమొలకలు వేసి, ఆ నేలనంతనీ నీటితో తడిపాడు. దారిలో అడుగుజాడలు చెరిపివేస్తూ యథాస్థానం చేరి, అక్కడ మిత్రులకోసం ఆత్రుతతో నిరీక్షిస్తూ కూర్చున్నాడు. మళ్లీ స్వేచ్ఛగా మానవసమాజంలో చరించాలని డాంటే ఆతుర పడుతున్నాడు. నలుగురి మధ్యనూ మసలాలని కోరిక గలిగింది. సమాజంలో కేవలం ఐశ్వర్యంవల్లనే లబ్ధి కాగల పరపతి, ఉన్నతి, ఆధిక్యం, అధికారం వెంటనే పొందాలనే వాంఛ బలీయమయింది.

ఆరో రోజుకి అతని మిత్రులు వచ్చారు. డాంటే తీరంవరకూ దేకుతూ వెళ్లాడు. తన స్థితి కొంత మేలే అయినప్పటికీ, ఇంకా నొప్పి పూర్తిగా తగ్గలేదని మిత్రులతో చెప్పాడు.

మిత్రులు తమ సాహసకార్యాలను గురించి డాంటేకి వివరించారు. అంతా కలబోసి చూస్తే వారికి లాభమే కనపడింది. డాంటే రాలేక పోయినందుకు విచారపడ్డారు. వారిలో ప్రతి ఒక్కడూ ఏభై స్పానిష్ డాలర్లు సంపాదించాడు. ఇది డాంటే పోగొట్టుకున్నందుకు జకోపో చింతపడ్డాడు. పోగొట్టుకున్న ఈ సంపాదన గురించి విన్న డాంటేకి చిరునవ్వైనా రాలేదు.

డాంటే జూన్ ఎమిలీ నౌకలో లెగ్‌హారన్ రేవు చేరాడు. అక్కడ ఒక యూదు వ్యాపారివద్దకు వెళ్లి నాలుగు చిన్న వజ్రాలను ఒక్కొక్కటి అయిదువేల ఫ్రాంకులకు విక్రయించాడు. నావికుడైన వానికి ఈ అమూల్య వజ్రాలెలా లభించాయని వ్యాపారి అడగవలసిందే. కాని, ఒక్కొక్కదానిపైన వెయ్యి ఫ్రాంకుల లాభం లభిస్తున్నదని చూసి వ్యాపారి మౌనం వహించాడు.

మరునాడు ఉదయం డాంటే ఒక కొత్త బోటు కొని జకోపోకి బహూకరించాడు. అవసరమైన సామగ్రినంతా కొనడానికి వెయ్యి స్పానిష్ డాలర్లు ఇచ్చాడు. మార్సేల్స్ వెళ్లి మైలాన్‌వీధిలో లూయీడాంటే అనే వృద్ధునిగురించీ, కాటలన్స్ గ్రామంలో మర్సిడా అనే ఒక యువతినిగురించీ సమాచారం తెలుసుకు రావలసిందని జకోపోను పంపాడు. ఇదంతా చూసి జకోపో కలకంటున్నట్లు ఆశ్చర్యపడ్డాడు. డాంటే, తన తల్లిదండ్రులు ధన మివ్వనందుకు కోపించి పారిపోయి నావికుడుగా చేరినట్లు, ఇప్పుడు లెగ్‌హారన్ రాగానే పినతండ్రి ఆస్తి తనకి సంక్రమించినట్లు కథ అల్లి చెప్పాడు. ఈ ఆస్తికంతకీ తానే వారసుడన్నాడు. డాంటే విద్య, సద్వర్తన గమనించిన జకోపో, ఈ కథను సులువుగా నమ్మాడు.

మరుచటి రోజే జకోపో మార్సేల్స్‌కి ప్రయాణమై వెళ్లాడు. తిరిగి మాంట్ క్రిస్టో ద్వీపంలో కలుసుకోవలసిందని అతనికి డాంటే చెప్పాడు. డాంటే మిగిలిన తన మిత్రులందరికీ ఉదారంగా పారితోషికాలిచ్చి, వారివద్ద సెలవు తీసుకుని వెళ్లిపోయాడు. కాని ఎక్కడికి వెడుతున్నదీ ఎవరికీ తెలపలేదు.

ఇంక జాప్యం చెయ్యకుండా డాంటే రహస్యంగా బయలుదేరి జినోవా చేరాడు. అక్కడ రేవులో అతనికి చక్కని బోటు ఒకటి కనపడింది. అది ఒక బ్రిటిష్ దేశస్థునికోసం అతి వేగంగా సముద్రాలలో ప్రయాణం చెయ్యడానికి వీలుగా నిర్మించబడింది. బ్రిటిష్ దేశస్థుడు నలభైవేల ఫ్రాంకు లివ్వడానికి నిర్ణయించుకుని ఉన్నాడు. డాంటే దానికి వెంటనే అరవై ఫ్రాంకు లిచ్చి కొనడానికి సిద్ధపడ్డాడు. బేరం కుదిరింది. నౌకానిర్మాతని ఒక యూదు వ్యాపారివద్దకు తీసుకువెళ్లి డాంటే అక్కడ ధన మిచ్చాడు. తరవాత బోటులో పడక గదిలోని పడక తలక్రింద రహస్యమైన పెట్టె నిర్మించాలని నిర్మాతకి పురమాయించాడు. పెట్టెలో మూడు అర లుండాలి. అవి తెరవడానికి స్ప్రింగులు, ఎవరికీ కనపడని బోట ఏర్పాటు కావాలి. ఒక్క రోజులో అంతా ఏర్పాటయింది.

అంతా సిద్ధమైన తరవాత డాంటే తన కొత్త బోటులో ప్రయాణమైనాడు. నావికు లెవరూ అవసరం లేకనే అతనొక్కడే బోటు నడిపాడు.

త్వరలోనే కొత్తబోటు నడపడంలో డాంటేకి చెయ్యి నలిగింది. బుద్ధి తెలిసిన ప్రాణివలె ఆ బోటు సముద్రాలపైన దిక్కు తిరిగి చరచరా పయనిస్తోంది. నిజంగా జినోవా నౌకానిర్మాతలు ప్రపంచంలోకెల్ల శ్రేష్ఠులని డాంటే ఇప్పుడనుకున్నాడు. ఆ బోట ఎక్కడికి నడితే అక్కడ ప్రజలు విరగబడి చోద్యం చూసేవారు. అది ఎక్కడికి వెడుతున్నదో, ఎక్కడినుంచి వస్తున్నదో ఎవరికీ తెలియదు. మాంట్ క్రిస్టో ద్వీపంసంగతి ఎవరికీ యోచన కలగలేదు.

ఒకనాడు డాంటే తన బోటులో మాంట్ క్రిస్టో ద్వీపానికి వెళ్లి, మామూలు రేవులో కాక, లోనికి చొచ్చుకున్న సముద్రపు పాయలో ప్రవేశించి ఒక గట్టున దిగాడు. గుహలోకి వెళ్లి చూడగా అంతా ఎప్పటిమాదిరిగానే ఉంది. మరునాడు గుహలోని నిక్షేపమంతా బోటులోకి తరలించబడింది. అది పడక తలకింద రహస్యపు పెట్టెలో గుప్తపరచబడింది.

డాంటే అక్కడ వారంరోజు లున్నాడు. వారం రోజులూ బోటులో చుట్టూ తిరుగుతూ ద్వీపాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. నిపుణుడైన రౌతు తన గుర్రాన్ని పరిశీలించినట్లుగా డాంటే ద్వీపాన్ని పరిశీలించి, నైసర్గికస్థితి నంతా ఆకళింపు చేసుకున్నాడు.

అనువాదం: సీతారామ్

ఎనిమిదవ రోజున దూరాన ఒక బోటు కనపడింది. డాంటీ సంకేత మిచ్చాడు. అది దగ్గరకు వచ్చింది. బోటులోనుంచి జకోపో దిగివచ్చాడు.

జకోపో తెచ్చిన సమాచారం డాంటీకి దుఃఖకారణమయింది. వృద్ధుడు లూయీ డాంటీ మృతిచెందాడు; మర్సిడా ఎక్కడికో మాయ మయింది.

డాంటీ నిశ్చలభావంతో సమాచారం విన్నాడు. తన నెవ్వరూ అనుసరించరాదని చెప్పి, డాంటీ ఒక్కడూ తీరానికి వెళ్ళాడు. రెండుగంటలలో తిరిగివచ్చి, జకోపో పంపిన ఇద్దరు నావికుల సహాయంతో తన బోటును పాయనుంచి తిప్పించి సముద్రంలోకి తెచ్చాడు. అక్కడనుంచి మార్సేల్స్ రేవుకు వెళ్ళాలని నావికులకు ఆజ్ఞ ఇచ్చాడు.

తన తండ్రి చనిపోయి ఉంటాడని డాంటీ ముందే ఊహించుకున్నాడు. కాని మర్సిడా ఏమయినట్లు? ఆమె ఆచూకీ తియ్యడానికి మార్గం చెప్పాలంటే, తన రహస్యాన్ని బయలుపెట్టక తప్పదు. అదీకాక అతనికి మరికొంత సమాచారంకూడా తెలుసుకోవలసిన అవసరం ఉంది. అది తనకే కాని అన్యులెవరికీ తెలియ రానిది. అందువల్ల తనే బయలుదేరాలని డాంటీ నిశ్చయించుకున్నాడు.

ఒకనాటి ఉదయం రెండు బోట్లు మార్సేల్స్ రేవు చేరాయి. ఇఫ్‌కోటకి డాంటీని తీసుకువెళ్ళినప్పుడు సిపాయిల పడవ ఎక్కడ బయలుదేరిందో, సరిగ్గా అక్కడే రెండుబోట్లు లంగరు వేశాయి.

సమీపంలోనే మరొక బోటులో సిపాయిలు కనపడగానే, డాంటీకి ఒళ్లు జలదరించింది. అయితే అభ్యాసంవల్ల, లోని ఉద్వేగాన్ని సులువుగా అణుచుకో గలిగాడు. లెగ్‌హారన్‌లో కొన్న ఇంగ్లీష్ ప్రయాణపు అనుమతిపత్రాన్ని చూపించి తీరంలో దిగాడు. ఇంగ్లీషువారిని ఆ రోజుల్లో ఫ్రాన్స్ దేశస్థులు ఆదరించేవారు.

డాంటీకి కానిబయర్ వద్ద మొట్టమొదట ఫరావో నావికుడొకడు ఎదురైనాడు. ఆ నావికుడు పూర్వం డాంటీ అధీనంలో పనిచేసినవాడే. కాబట్టి, ఇప్పుడు తనను చూసి పూర్వం సన్నిహితులైనవారు గుర్తుపట్టగలరో, లేరో పరిశీలించడానికి డాంటీకి అదను లభించింది. తిన్నగా అతనిని సమీపించి అవీ ఇవీ అడిగాడు. అతడు డాంటీని జన్మలో ఎన్నడూ చూడనట్లే, అపరిచితునితో మాట్లాడుతున్నట్లే జవాబు లిచ్చాడు. డాంటీ తృప్తిపడి అతని చేతిలో ఒక నాణెం పెట్టాడు. నావికుడు వెళ్లిపోతూ నాణెం చూసి ఆగిపోయాడు. ఆశ్చర్యపడి డాంటీ వెనకనే పరుగెత్తి వచ్చి, "మీరు పొరపడినట్టున్నారు. నా కిచ్చినది బంగారు నాణెం."

డాంటీ చూశాడు: "అవును. పొరపాటే జరిగి ఉంటుంది. అయితే, నువ్వు నిజాయితీ పరుడివి. కాబట్టి, అది తీసేసుకో," అన్నాడు. నావికుడు నిశ్చేష్టుడై చూశాడు. నిశ్చింతగా వెళ్లిపోతున్న యువకుని చూసి "అబ్బో! ఎవరో ఇండియానించి వచ్చిన పెద్ద నవాబు కాబోలు!" అనుకున్నాడు.

మార్సేల్స్ నగర వీధులలో డాంటీ మెల్లిగా నడిచి వెడుతున్నాడు. అడుగడుగునా అతనికి ఆవేగం అధికమౌతోంది. ప్రతి వీధి మలుపునా పూర్వస్మృతులు అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ప్రతివీధీ అతని బాల్యజీవనాన్ని జ్ఞప్తికి తెస్తోంది. చివరికి తండ్రి నివసించిన ఇంటివద్దకు చేరాడు. వృద్ధుడతి శ్రద్ధతో పెంచి తన చేతులతో కిటికీ ఊచల నెక్కించిన పూలతీగ లిప్పుడు లేవు. డాంటీ ఒకచెట్టుమొదలు నానుకుని నిలిచి, ఆ పేదగృహం మీద్దవంక చూస్తూ ఉండిపోయాడు.

కొంతసేపటికి తేగువుని ద్వారం సమీపించి పిలిచాడు. ఆ యింటిలో బస చెయ్యగోరినట్లు చెప్పాడు. కాని ఖాళీలేదు. కనీసం మేడమీదిగదిని ఒక్కసారి చూడనివ్వాలని ప్రార్థించాడు. కొత్తగా పెళ్లిచేసుకున్న దంపతు లిద్ద రాగదిని అద్దికి తీసుకున్నారు. వారి అనుమతితో డాంటీ గదిని పరిశీలించాడు. కాని, పూర్వస్మృతులు తెచ్చేవి ఏవీ ఆగదిలో మొదట కనపడలేదు. గోడలు వెల్లవెయ్యబడి ఉన్నాయి. కుర్చీలు, బల్లలు కొత్తవి. పడకమాత్రం అదే, ఎప్పటిస్థానంలోనే ఉంది. అది చూసినప్పుడు డాంటీకి కళ్లు చెమ్మగిలినాయి. అక్కడే తన తండ్రి తన పేరు తలుచుకుంటూ ప్రాణాలు విడిచి ఉంటాడనుకున్నాడు.

కొత్తదంపతు లిద్దరూ డాంటీని చూసి చకితులైనారు. డాంటీ నిశ్చేష్టుడై పడకవంక చూస్తున్నాడు. అచంచలమైన మనోదార్ఢ్యాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించే అతని ముఖం కొద్దిగా వివర్ణమయింది. కళ్లవెంట నీటిబిందువులు జారుతున్నాయి. పరితాపం పవిత్రమైనదని తలిచి, నూతన దంపతులు నిశ్శబ్దంగా గదివిడిచి వెళ్లిపోయారు. తరవాత డాంటీ గదివిడిచి రాగానే ఇద్దరూ అతన్ని అనుసరించివెళ్లి, కోరినప్పుడు వచ్చి ఆ గది చూడవచ్చని చెప్పారు.

మేడదిగి వచ్చి డాంటీ పక్క తలుపుతట్టి కాడరూస్‌ను గురించిన సమాచారం అడిగాడు. కాడరూస్ కష్టాలలోపడి దర్జీవృత్తి మానుకుని, ఇప్పుడు బెల్‌గార్డ్—బుకేర్ రోడ్డులో ఒక హోటల్ పెట్టుకున్నాడని తెలిసింది.

ఇంటియజమాని పేరడిగి తెలుసుకుని డాంటీ అతనివద్దకు వెళ్లాడు. అతనితో తనపేరు లార్డ్ విల్మోర్ అని చెప్పి, ఇంటిని పాతికవేల ఫ్రాంకులకు కొనేశాడు. అసలు విలువ పదిహేను వేలే అయినప్పటికీ, లక్ష ఫ్రాంకులకైనాసరే కొనితీరాలని డాంటీ పట్టుదల. ఆ రోజునే మేడమీదిగది ఖాళీచెయ్యాలని కొత్తదంపతులకు తెలియపరచబడింది. అదేఇంటిలో మరేగదులైనాసరే కోరుకో వచ్చునని డాంటీవారికి చెప్పాడు. ఈ చిత్రసంఘటనగురించి మైలాన్ వీధిలో వారంరోజులపాటు చర్చలు, వదంతులు చెలరేగాయి. అందరూ అనేకరకాలుగా ఊహించుకున్నారు. కాని, నిజం తెలుసుకో గలిగినవారెవరూ లేరు.

ఇంతకంటె ఎక్కువగా అక్కడి ప్రజల్ని ఆశ్చర్యపరిచిన విషయం మరొకటుంది. ఇంతటి ఐశ్వర్యవంతుడైన ఈ నూతన వ్యక్తి కాటలన్స్ పల్లెవాసుల గ్రామానికి వెళ్లి ఒక గుడిసెలో ఎవరితోనో గంటసేపు మాట్లాడాడు. పదిహేను, పదహారేళ్లలో చనిపోయినవారు, మాయమైనవారు కొందరినిగురించి సమాచారం అడిగాడు. తనకు సమాచారం చెప్పిన పల్లెకారికి మరునాడు డాంటీ కొత్త బోటొకటి, రెండు కొత్త వలలు కొని బహూకరించాడు. తరవాత, తన నావికులకు ఆజ్ఞ లిచ్చి, డాంటీ తానొక గుర్రమెక్కి మార్సేల్స్ నగరం విడిచి వెళ్లిపోయాడు.

## 26

దక్షిణ ఫ్రాన్స్‌లో బెల్‌గార్డ్ - బుకేర్ రహదారిలో ఒక చిన్న హోటల్ ఉంది. హోటల్ వెనక ఒక చిన్న తోటకూడా ఉంది. తోటవెనక ఒక ద్వారం ఉంది. పేరుకి తోటేగాని, ఆవరణలో కొద్దిగా గిడసబారిన చెట్లు, ఒక్కటే పెద్ద వృక్షం, అక్కడక్కడ కాయగూరల పాదులూ మాత్రమే ఉన్నాయి. వాయవ్య పవనాల తాకిడికి చెట్లన్నీ ఆగ్నేయముఖంగా తలలు వొంచుకున్నాయి. ఆ ప్రాంతమంతా నేల చవుడుబారి మొక్కలాట్టే లేక బొగులు బొగులుమంటూ ఉంటుంది. అక్కడా అక్కడా చెదురుగా గోధుమ చేలున్నాయి.

(34-వ పేజీ చూడండి)

# అతివృష్టి

(14-వ పేజీ తరువాయి)

అని ఒక్క ఉత్తరంలో నేనా రాసేరేమో చూడు" అంది సింగమ్మ.

ఇంతటిలో తల్లి వచ్చింది.

చూడే అమ్మా! దీని పుట్టింటివాళ్ల చుప్పనాతితనం! ఇదిగో మీపిల్లకి సంబంధాలు వాకబుచేస్తున్నామని ఒక్క ఉత్తరంలో నేనా రాసేరేమో చూడు!"అంది సింగమ్మ.

"అది అలాగుంచు. ఈఅష్టదరిద్రదేవత ఇంటికి వచ్చేక శనిపట్టుకొంది. పిల్లకి అంతకిముందు వచ్చే సంబంధాలుకూడా వెనక్కిపోయేయి. చచురుకాళ్ల మహాలక్ష్మి కొంపకిదాపురించేక ఏమవుతుంది! నేను ఈ ఇంటిలో అడుగుపెట్టేక వీళ్లకిఎటువంటి ఐశ్వర్యంపట్టిందో చూడు. మా ఆడబిడ్డలకి, మరుదులకి అంతకిముందు పెళ్లిళ్లు లేవు. అటువంటిది నేను పాదంమోపేక అవన్నీ జరిగేయి. అంతకిముందు మీనాన్న పనిపాట్లులేకుండా వీధులవెంబడి బలాదూరు దిరిగేవారు. అటువంటిది నేనువచ్చేక ఉద్యోగం వచ్చింది. ఈభోగమంతా వచ్చింది" అంది తులసెమ్మ.

"మాకీ శనిగొట్టుదేవత ఎక్కడప్రవేశించిందోనమ్మా! అంది సింగమ్మ.

"ఇదిపాదంపెట్టేక ఇప్పుడు ఉన్నది ఊడ్చుకుపోకుండాను, మనం నలుగురమూ బతికి ఉన్నప్పుడూ చూసుకోందాంలే?" అంది తల్లి.

ఇంతటిలో వీధిలో "ఏమండోయి తులసెమ్మగారూ!" అంటూ పిలుపు వినవచ్చింది. తులసెమ్మ, సింగమ్మ వీధిగుమ్మం దగ్గరికి వెళ్లారు. లోపల రామామణి పిండి విసురుతూంది.

"క్షేమమా! శోభనాచలం గారి తాలూకువాళ్లం!" అంది శోభనాచలం భార్య.

"సరి! సరి! మీరా! ఏమిటి విశేషాలు! కూర్చోండి!" అని తులసెమ్మ అనగా, సింగమ్మ చాప వేసింది.

అందరూ సావిటిలో కూర్చున్నారు.

"కోడలు ఇంటిలోనే ఉందా?" అని అడిగింది శోభనాచలం భార్య.

"అబ్బే! ఇంటిలో ఎక్కడమ్మా! మా పెత్తల్లిని ఒకమాటుచూసివస్తానని ఇవాళే బయల్దేరి వెళ్లింది. పెత్తండ్రే వచ్చి నాలుగురోజులు ఇక్కడఉండి పిల్లని మరీతీసుకువెళ్లాడు. అక్కడినుంచి పుట్టింటికి కూడా ఒకమాటు వెళ్లిరమ్మన్నాం. అటుతల్లి రాకయేక ఇటుకోడలు వెళ్లకపోయేక ఇహ ఎలాగు! చిన్నపిల్లకదా! అంచేత వెళ్లాళ్ల ఈమధ్యరాదు" అంది తులసెమ్మ.

"ఈ ఇంటిలోఅంతా ఆవిడఇష్టమే కాని మాఇష్టమేమీ లేదమ్మా!" అంది సింగమ్మ.

"మరి మీతర్వాత కోడలిచేకదా పెత్తనమంతా! అంచేత ఇప్పటినుంచీ తరిఫీదు ఇయ్యకపోతే ఎలాగు! అత్తకాలం అంత్యకాలం, కోడలికాలం కొంతకాలం అని సామెత కదా!"అంది శోభనాచలంభార్య

"అబ్బే! ఇహ మాకాలమంతా అయిపోయింది. ఏదో ఒకమూల 'రామ, కృష్ణ' అనుకొంటూ పడిఉండడం, పిలిచినప్పుడు వేళకివెళ్లి నాలుగుమెతుకులు గొంతుకలో పడవేసుకొని మళ్లీవచ్చి మూలకూర్చోడం! ఇంతకంటే మేము చెయ్యవలసింది ఏముంది చెప్పండి? ఓపికఉన్నన్నాళ్లు పాటుపడ్డాం చాలదూ! దీనికి అంతెక్కడ!" అంది తులసెమ్మ.

"మీకేమండి మహరాజులు! పెట్టిపుట్టారు! ఇంటిభారం మెడమీదలేకపోయేక మహాదృష్టవంతులని వేరే చెప్పేదేమిటి!" అంది శోభనాచలంభార్య.

"ఇహ ఇలాగు కాలంవెళ్లబుచ్చుకుంటే చాలదూ!" అంది తులసెమ్మ.

"ఇల్లుమీ సొంతమేకదూ?" అని "సావిడి బాగానే ఉంది! పెరటిలో ఎవరో పని చేసుకొంటూన్నట్లుగా ఉన్నారు" అంది శోభనాచలంభార్య.

"దాసీది ఏదోపని చేస్తూంది" అంది తులసెమ్మ.

"బాగానేఉంది ఇల్లు! చక్కగా పెట్టెలాగు ఉంది!" అంది శోభనాచలంభార్య. ఇంటిలోకివచ్చి చూడండి ఒ మాటు అని తులసెమ్మ అంటుందేమో ఒకమాటు ఇల్లంతా చూద్దామనుకొంది. కాని తులసెమ్మ అనకపోగా ఆవిడకూడా ఊరుకొంది. మరికొంతసేపు పిచ్చాపాటి మాట్లాడి "వెళ్లివస్తానమ్మా! ఎప్పుడేనా తీరుబాటు చేసుకొని మా ఇంటికి ఒకమాటు రండి" అని ఆహ్వానించగా "ఎంతమాట?" అని జవాబు చెప్పింది తులసెమ్మ. శోభనాచలం భార్య వెళ్లిపోతుంది. 

(ఇంకా వుంది)



"మనం పెళ్లాడాం గనక నీలోని కొన్ని లోపాలు తెలుపుతాను?"

"ఎందుకు? నే నాలోపా లెరుగుదును. వాటిమూలంగా నేను మీతో సరిపెట్టుకోవలసి వచ్చింది."

* * * *

కండక్టరు: (ప్రయాణీకుడితో) ఆ పెట్టె దారి కడ్డం పెట్టారు. వచ్చేపొయ్యేవాళ్లు పడగలరు. పక్కగా పెట్టండి.

ప్రయాణీకుడు: అక్కడే ఉండనీ. ఎవరో ఒకరు పడుతూ ఉండకపోతే దాని సంగతే జ్ఞాపకం ఉండదు నాకు.

# సహగమనం

(11-వ పేజీ తరువాయి)

మా దీపూరే! ఏదో శిస్తులకని వొచ్చాను. నిన్న సినిమా హాల్లో తురంగరావుని చూశాను. అప్పుడే పలకరిద్దామనుకొన్నాను. కాని కుదరలేదు. ఇప్పుడు బజార్లో కనపడితే వెనకాల వొచ్చాను" అంటూ లోపలకొచ్చాడు.

తురంగరావు "రండి, కూచోండి" అని ఆహ్వానించాడు. గ్రేసు లోపలికి వెళ్ళింది.

ఆయన కూచున్నాడు. "మీలాంటి ప్రేమైకజీవుల్ని ఎక్కడా చూడలేదు. ఏం పట్టుదలా, దీక్షా..."

తురంగరావు పైకి చిరునవ్వు నవ్వాడు. లోపల అగ్ని రగుల్తోంది.

"షేక్స్పియర్ బతికుంటే మీ ప్రేమగాథని ఓ గొప్ప నాటకంగా రాసేవాడు."

తురంగరావు "ఏదో ప్రేమచేత అలా అంటున్నారు" అన్నాడు.

ఐరనీగ్రేస్ టీ తెచ్చింది. కాని ఆయన కృతజ్ఞత తెల్పుతూ స్వీకరించలేదు. తర్వాత వెళ్ళడానికి లేచాడు.

"మీకు శుభం కలుగుతుందని ఆశిస్తున్నాను" అని వెళ్ళాడు ఆయన.

"అశుభం కాకుండావుంటే బ్రహ్మదేవుడికి వెయ్యి నమస్కారాలు" అనుకున్నాడు లోపల తురంగరావు.

ఐరనీగ్రేసు అంది: "ఈ దొంగముండాకొడుకు ఇక్కడ దాపరించాడు. ఏం చెయ్యడుకద!"

"ఏం చేస్తాడు? మన్ని ఇన్నాళ్ళనించీ ఎరిగున్నవాళ్లు ఇవాళ ఇతను చెబితే ద్రోహం చేస్తారా?" గుడ్డినమ్మకంతో ఏదో అన్నాడు కాని అతనికీ లోపల బెంగగానే [illegible].

ఎందుకు చెయ్యడు? ప్రిన్సిపాల్ చేత మొహం మాడిపించిందిగా! ఆ వూళ్లో ఆయనకి పలుకుబడికూడా వుంది! వాళ్లు ఆ వూళ్లో ఎవరో కమ్మ, వారింట్లో ఉంటున్నారు. ఆయనకివాళ్ళ చెవులో వీళ్లు సంకరపు పెళ్లి బాపతు' అని వూదాడు. కమ్మాయన పాలేరుచేత కబురంపాడు రాత్రికిరాత్రి ఇల్లు ఖాళీ చెయ్యాలని. అతను సినిమాదగ్గరున్నాడు. ఆపాలేరుచేత గ్రేసుతురంగరావుకి కబురుచేసింది.

"లెక్చరరీ పుణ్యంకట్టుకున్నాడని" అతను యజమానికి చెప్పకుండా, రొజుకుంటూ వొచ్చాడు.

ఈ పాటికి కమ్మరైతుకూడా వొచ్చాడు అక్కడికి.

"రేపు ఖాళీచేస్తాం, ఈ రాత్రికి వుండనివ్వండి" అన్నాడు తురంగరావు.

"వీల్లేదు, బాపనోడూ, కిరస్తానిదీ, భలే కాపరం చట్టబండలైనట్టే వుంది. నాకిన్నాళ్లూ తెల్లేలేదు-లేకపోతే పాలేర్లచేత బయట పారేయిస్తా" గట్టిగా అరిచాడు.

వాళ్లిద్దరూ ఆ లెక్చరరీని ఎంతశపించుకున్నారో లోపల.

తురంగరావుకి కళ్ళవీళ్లు తిరిగాయి. ఐరనీగ్రేసుకీ అంతే! "నిశ్చల ప్రేమకి లోకంలో చోటులేదు; ఎప్పుడుకులాలూ, మతాలూ, కుళ్ళూ కంపూ" అనుకుంది లోపల. బాధతో, అవమానంతో కళ్ళవెంబడి వీళ్లు కారుతూనే వున్నాయి. తురంగరావుకి అవి కనపడకుండా ఒకసారితుడుచుకుంది.

సామానులన్నీ బయట పెట్టారు. ఆ చుట్టుపక్కలుండరాదని గదమాయించాడు మళ్ళా ఆరయితు; తనచుట్టూ మూగినచాలామంది ఆసటచూసుకుని.

"ఓ పెద్దమనుషులారా! మీరంతా రాక్షసులా, మనుషులా! ఈ లోకంలో ఒక మనిషి, స్త్రీ ప్రేమించుకుని భార్యాభర్తలుగా బతకడానికి వీలులేదా? దానికి కులాలు మతాలుఎందుకు? కులంలేని కులం మాది! మతంలేనిమతంమాది!! మమ్మల్నెందుకు చంపుకుతింటారు" అని గట్టిగా అరిచి కిందకూలబడ్డాడు తురంగరావు.

గ్రేసు అతనితలని ఒడిలోకి తీసుకుంది.

## 4

ఇలా సంఘంనించి తరమబడ్డ అతన్నీ, అతని భార్యనీ ఆ రైతు పాలేరే మాలగూడెంలో ఒక ఖాళీ గుడిసెలోకి చేర్చాడన్న సంగతి నేను వేరే చెప్పనక్కర్లేదు.

మామూలులోకంలో వుండే పోరు వాళ్లకిక్కడ లేదు. పైగా అందరూ వాళ్లని గౌరవించేవారు. తర్వాత అతని సినిమాలో వుద్యోగం పోవడంకూడ ఆశ్చర్యకరమైన విషయం కాదు. అక్కడ కూలీలతో కష్టపడుతూ, వాళ్లకి రాత్రిళ్లు చదువు చెబుతూండేవాడు.

ఇలా నాలుగైదునెల్లు గడిచింది. ఇక్కడ ప్రేమని నమ్ముకుని సుఖంగా జీవించేవారు.

కాని అతను స్వతహాగా సుకుమారుడు. ఎండా, వానా ఎరక్కుండా పెరిగిన రకం. అలాంటిది మానసికంగా, భౌతికంగా అతని మీద అతని ప్రేమనీ, వాళ్ల ప్రేమ విలువనీ తెల్సుకోకుండా కసి తీర్చుకున్నారు, అతన్ని మానసికంగా చంపి, భౌతికంగా బాధించి నీతినియమాల శాస్త్రవేత్తలూ, పెద్ద మనుషులూ.

ఈ మార్పులతో అతను జబ్బుపడ్డాడు. పది లంఖణాలు చేశాక తన్ను సమాజాన్నీ, సంకుచిత నీతినియమాల లోకాన్నీ విడిచి స్వేచ్ఛాజీవి అయ్యాడు.

ఐరనీగ్రేస్‌కి తెల్సు: జీవితంలో యిన్ని కష్టాలొస్తాయని. అయినా అతని ప్రేమని కాదనలేకపోయింది. ప్రేమకి, ప్రేమ ప్రతిఫలం కాకపోతే సంఘం చేసిన ద్రోహం తనే చేసినట్టు, అతనెప్పుడో మరణించి వుండునేమోనని ఆమె నమ్మకం.

చుట్టుపక్కలవాళ్లు అతన్ని శ్మశానవాటిక తీసుకువెళ్ళి, హిందూపద్ధతిలో తగులబెట్టారు, ఏటి వొడ్డున.

మంటల్లో భర్తని చూసి, మనసులో ఏసుని తల్చుకుంది గ్రేసు. అంతా వెళ్లాక నదిలోకి నడిచింది, పతిని అనుసరించడానికి. గంగ ఆహ్వానించింది. అంతే రెండు జీవితాల అంతం ఆ వేళతో అయింది.

సుందరే చెప్పాడు ఈకథ పేరు సహగమనం అని—కాని సహగమనం కాదు, మీరు అనుకున్నట్టు.

క్షమించండి. 

# శేష ప్రశ్న

(17-వ పేజీ తరువాయి)

నేను విశ్వసించలేకపోతున్నాను. అటు విద్యార్థినులు అబద్ధమాడుతున్నా రనడం లేదు. ఇది జరిగిఉండుటమాత్రం తథ్యం. కాని దానిలో రమేష్ పాత్ర ఎంతవరకు అనేదే సమస్య. అయినా త్వరపడి ఏదో ఒక నిర్ణయానికి రావటం మంచిది గాదు." అంటూ ప్రిన్సిపాల్ గారు ముగించారు. ముఖాముఖాలు చూచుకున్న పిదప సభ్యులందరూ వివాదగ్రస్తంగా ఉందిగనుక రమేష్ విషయం తెలుసుకోనవలసిన అవసరం ఉందిగనుక వార్షికోత్సవం అనంతరమని వాయిదా వేశారు. తరువాత ప్రిన్సిపాలుగారు రమేష్‌ను రమ్మని నోటీసు పంపారు. విద్యార్థినుల ముఖాలు సంతోషంతో వికసించినై. తప్పకుండా సత్వర మే తగుచర్య తీసుకుంటారని వాళ్ల ఆశ. "నీపై తేబడ్డ అభియోగానికి సంజాయిషీ చెప్పవలసిఉంటుంది. మీవలెనే వాళ్ళు గూడ చదువుకునేందుకు వచ్చారు గాని విలాసాలకు, వినోదాలకు రాలేదన్న విషయం గుర్తుంచుకోవాలి. ప్రతిమనిషి ఎదుటివారిని కనీసం మనిషిగానైనా గుర్తించి గౌరవించాలి. కర్తవ్యాన్ని మరిచి తగని పనులు చేయటం విజ్ఞానవంతుల లక్షణం గాదు. నీవెలాంటివాడవైనదీ నాకు తెలుసు. బహుశః నీకం తెలుగూడా నేమో......" అన్నారు మందలింపుగా ప్రిన్సిపాలుగారు. తన కేమీ తెలియదని ఇలాంటి అనవసరవిషయాల్లో కలుగజేసుకునేంత అవసరం, అవకాశాలు నాకు లేవన్నాడు. "సరే నీవే ఆలోచించు ఇదెంతవరకు సమంజసమో? పెళ్లి గావలసినవారు. వాళ్లతల్లిదండ్రుల్ని వదలి సర్వం మె మేనని మాపై భారంవేసి నమ్మివచ్చారు. కాని ఈ దశలోని ఇలాంటి నిందలే భావి జీవిత విఘాతాలై పతనంజెందుట కనుమైన మాగా లౌతవి. మనుష్యుల్ని అగాధంలోకి త్రోసి నిస్సహాయులై విలపిస్తుంటే ఒడ్డున కూర్చుని పరిహసిస్తూ కేరింతలు కొట్టగలమా??? సరే వార్షికోత్సవం జరిగిన మరునాడుదయం కన్పించు." అన్నారు ప్రిన్సిపాలుగారు మందలింపుగా.

వ్యథతో కలతజెందిన సరోజినిహృదయం కాలేజీకి రానిచ్చగించలేదు. అవమాన భారంచే క్రుంగిపోయి ముకుళించుపోయింది. అనుక్షణం ప్రతీకారేచ్ఛ - ద్వేషం నరనరాల పాకిపోయి ఆరాటపెడుతున్నై. పొంగులువారే ప్రతిరక్తకణంలోను అస్పష్టమైన ప్రతీకారపు చిహ్నాలుమిళితమై పరుగులిడుతోన్నై. కాలేజీ వార్షికోత్సవం జరుగుతోంది. నిర్విఘ్నంగా, జయప్రదంగా నిర్వహించారు. డ్రామాలు, పాటలు, నృత్యాలు అన్నివిధాలా ప్రజల విద్యార్థుల హృదయాల్ని రంజింపజేసి చూరగొన్నారు. సాయంకాలం కాలేజి హాలులో ప్రత్యేకంగా విద్యార్థులు, లెక్చరర్లును సమావేశం జరుపుతుంటున్నారు. ప్రతి సంవత్సరం కాలేజి అభివృద్ధి విద్యావృద్ధి లోటుపాట్లు వీటన్నిటిని గురించి ప్రిన్సిపాలుగారు నిశితంగా సమీమర్శతో గూడిన సుదీర్ఘోపన్యాసంతో విద్యార్థులకు, లెక్చరర్లకు చక్కని సందేశాన్ని సలహాలూ పెడా ఇచ్చారు. ఆదర్శంగా చదువులో ముందడుగు వేస్తున్న రమేష్‌ని అందరకూ పరిచయంచేశారు. హాలంతా కోలాహలంతో నిండిపోయింది. ముగ్ధులై వింటున్నారందరు. శరత్ కాలపు సూర్యుడు చలిగొని ప్రియురాలి కౌగిలికై వేగిరపడుతున్నాడు.

కొందరు విద్యార్థినులు సమధికోత్సాహంతో ప్రిన్సిపాలుగారి ఉపన్యాసాన్ని నిశ్శబ్దంగా వింటున్నారు. కాని విద్యార్థినులందరూ పాల్గొనలేక పోయారాత్మాభిమానంతో. నిర్లిప్తత నైరాశ్యతలు ఆవరించినై. ప్రక్కనేఉన్న లేడీస్ వెయిటింగు రూముమాత్రం గాజుల కలకలంతో ప్రతిధ్వనిస్తోంది. సంజ చీకట్లు వెలుగుతో ఘోరయు

**సినిమా:**

# ఫిలింవిచారణ సంఘనివేదిక

ఎన్నో మాసాలపాటు ఎన్నో చోట్లకు వెళ్ళి ఎంతోమందిని కలుసుకుని ఎన్నోసార్లు సమావేశాలు జరిపి ఫిలిం విచారణసంఘం ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించింది. ఇది జరిగి చాలా వారాలయింది. ఇంకా ఈ భామ వేషం తెర తొలగించుకుని ప్రేక్షకుల ఎదట పడలేదు. ప్రభుత్వం ఈ నివేదికలోని శిఫార్సులను అమలు జరిపితే దేశీయ సినిమా పరిశ్రమలో గొప్ప పరివర్తనా, విప్లవమూ కలుగుతుందని మాత్రం ఫిలిం విచారణ సంఘాధ్యక్షుడు ఎస్. కే. పాటిల్ పత్రికా విలేఖరులతో అనిఉన్నాడు.

ఇప్పుడు తెరవెనుకనుంచి నివేదికగురించి కొన్ని వివరాలు కొత్తవి తెలుస్తున్నాయి.

చట్టరీత్యా ఫిల్ము వ్యవహారమండలి ఒకటి ఏర్పరచాలని నివేదికలో శిఫార్సు జరిగిందట. ఈ మండలి కర్తవ్యాలేవంటే సలనచిత్రపరిశ్రమను క్రమబద్ధం చెయ్యటమూ, చిత్రనిర్మాణ చిత్రప్రదర్శనలను గురించి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు సలహాలివ్వటమూనూ. ఇందులో సినిమా పరిశ్రమలో పాల్గొనే వివిధవర్గాలవారికి ప్రాతినిధ్యం ఉండాలన్నారు. ఈ మండలి ప్రొడక్షన్‌కోడ్ అమలుచేసే పనినీ, సెన్సారు బోర్డు పనినీ తానే నిర్వహిస్తూ చిత్రనిర్మాణం, చిత్రప్రదర్శనం, డిస్ట్రిబ్యూషన్ మొదలైనవాటిని గురించి చూడడానికి వర్గాలను ఏర్పాటు చేయాలట.

ఈ ఏర్పాట్లన్నీ ప్రభుత్వ ఖర్చును ఏ విధంగా వృద్ధిచేసేదీ ఊహించటం సులభమే గాని చిత్రనిర్మాణాన్ని ఎట్లా క్రమబద్ధం చేసేదీ ఊహించటం సులభం కాదు. ...వాలంటే ప్రభుత్వం సినిమా పరిశ్రమకు తోడ్పడలేదని కాదు. ప్రభుత్వం చిత్రనిర్మాతలకు ధనసహాయం చేసి చిత్రాలు తీయించవచ్చు. కాని గొప్ప చిత్రనిర్మాత అయిఉండి చిత్రాలు తీసే పెట్టుబడి లేకపోయిన నిర్మాతలు చాలా అరుదు. బాగా లాభాలు గడించగల చిత్రాలు తీసేవారికి పెట్టుబడిదార్లలో చాలా పలుకుబడి ఉంటున్నది. చిత్రనిర్మాణానికి అవసరమైన పెట్టుబడి దేశంలో లేదనుకోవటానికి కూడా ఆధారం లేదు. నెలనెలా కొత్త చిత్రాలు తీసేవారు ముందుకు వస్తూనే ఉన్నారు. తెలుగుదేశంలోనే ఏడాదికి అయిదారు చిత్రాలకు తక్కువ లేకుండా దివాలా తీస్తున్నాయి. వీటిమీద ఏటా ఏ 20 లక్షలో దుర్వ్యయం అవుతూనే ఉన్నది. లాభాలు గడించేవారు మళ్ళీ చిత్రాలు తీయటానికి కొత్త పెట్టుబడి అవసరం లేదుగాని ఈ 20 లక్షలూ ఏ ఏడాదికా ఏడాది కొత్త పెట్టుబడే అనుకోవాలి.

గడచిన 20 ఏళ్లలో భారతీయ ఫిలిం పరిశ్రమ ఎటువంటి ప్రభుత్వ సహాయం అవసరం లేకుండానే పెద్ద పరిశ్రమగా అభివృద్ధి అయింది. ఇంకా అభివృద్ధి అవుతున్నది. ఒకవంక అభివృద్ధిచెందే పరిశ్రమను ఇంకా అభివృద్ధి చేయాలంటే ఈ పరిశ్రమకుగల అంతరాయాలేమున్నాయో వివరించి వాటిని ఈ మండలులూ, వర్గాలూ ఏ విధంగా నివారణచేస్తాయో నిర్ణయించాలి. లేనిపక్షాన ప్రభుత్వజోక్యం పాక్షిక విధానాలకు దారితీయవచ్చు. సినిమా పరిశ్రమ ప్రస్తుతం మద్రాసు, బొంబాయి, కలకత్తా రాష్ట్రాలలో మాత్రమే కేంద్రీకరించుకుని ఉన్నదనీ, ఒక భాషలో తీసే చిత్రాల ప్రమాణాలు గాని మార్కెటుగాని మరొక భాషలో తీసేవాటికి ఉండదనీ గుర్తించుకోవాలి. మద్రాసురాష్ట్రంలో తయారయ్యే తెలుగు తమిళ చిత్రాలకే ఈ వ్యత్యాసమున్నది. తమిళదేశంలో ఉన్న నగరాలు తెలుగుదేశంలో లేకపోవటంచేత ఒకమాదిరి తమిళచిత్రాలు తమ సొమ్ము తాము తెచ్చుకుంటుంటే ఎంతో మంచి తెలుగుచిత్రాలు తప్ప ఆ పని చెయ్యలేకుండా ఉన్నాయి. అటువంటి పరిశ్రమపై కేంద్రానికి అంతులేని అధికారాలిచ్చి ప్రతి విషయంలోనూ పరిశ్రమ కంతటికీ ఒకే ప్రమాణాలు నెలకొల్పటంవల్ల స్థానిక పరిశ్రమలకూ, నిర్మాతలకూ నష్టం ఉండవచ్చు.

చిత్రపరిశ్రమకు ప్రొడక్షన్‌కోడ్ ఉండాలన్నారు. ఇది సబబైనదే. అమెరికా చిత్రనిర్మాణంలో ఈ విధమైన కోడ్ చాలా ఉపయుక్తమైన పాత్ర నిర్వహించి ఉన్నది. ప్రొడక్షన్ కోడ్ ఉండి ఫిలిం సెన్సారింగు ఉన్నప్పుడు స్క్రిప్టులను ముందుగా తణిఖీకి పెట్టవలసిన అగత్యం ఏమిటో తెలియదు. ముందుగా స్క్రిప్టులు సమర్పించటంలో చాలా చిక్కులుండవచ్చు. చాలామంది నిర్మాతలు స్క్రిప్టును మార్చుకుంటూపోతారు. కొందరు తమ స్క్రిప్టులు బయట పెట్టటానికి ఒప్పుకోరు. వారి భయాలకు ఆధారాలు లేకపోలేదుకూడాను.

అన్నిటికన్న గమనించదగిన శిఫార్సు ఫిల్ముల పొడవుపై నిర్బంధం అవసరం లేదన్నది. ఈ నిర్ణయాన్ని సమర్థిస్తూ విచారణ సంఘంవారు చెప్పిన కారణాలన్నీ కిందటేడు జెమినీ అధిపతి వాసన్ చెప్పినవే. ఆయనవాదనలను విచారణసంఘంవారు పూర్తిగా ఆమోదించడం ఆశ్చర్యకరం. ఎందుకంటే వాటిలో కొన్ని కేవలం ఊహాజనితాలు. ఈ కిందివి అటువంటివి. "చిత్రాల పొడవు పరిమితం చెయ్యడంవల్ల వాటి నాణ్యత పెరగదు. ఖర్చులు తరగవు. ముడిఫిలిం వాడకంలో తరుగుదల ఉండదు."

ఇవి మాటలా అబద్ధాలే. మనం ప్రతి ఏడూ ఎన్ని చిత్రాలు చూసి అందులో కొన్నిభాగాలు కత్తిరించివేస్తే కథలో కాస్త వడికలిగి అంతగా విసుగెత్తేది కాదనుకోలేదు. చిత్రాలు దీర్ఘంగా ఉండాలన్న దానికి ఇతర ఆధారాలుంటే ఉండవచ్చు గాని ఇప్పుడు పొడవుగాఉన్న చిత్రాలలో నుంచి కొన్నిభాగాలు తీసేస్తే అవి బాగుపడవనుకోవటం కేవలమూ అసత్యం. హిందీ చిత్రాలమాట ఏమైనా దక్షిణాది చిత్రాలనుగురించి ఈ ముక్క ఎవరూ నమ్మరు.

చిత్రానికయ్యే ఖర్చులకూ చిత్రం పొడవుకూ సంబంధం లేదని వాసన్‌గారి వాదం. పదహారువేల అడుగుల చిత్రానికి ఒకరు వాడిన ఫిలింకన్నా మరొకరు 20 వేల అడుగుల చిత్రానికి తక్కువ ముడిఫిలిం వాడవచ్చు. మొదటి ఫిలిం 100 కాల్‌షీట్స్‌తో పూర్తిఅయితే రెండవది 80 కాల్‌షీట్స్‌తో పూర్తికావచ్చు. ఇది ఎవరూ కాదనరు. కాని ఒకే కథతో ఒకే ప్రొడ్యూసరు 16 వేల అడుగుల చిత్రానికి అంచనాలు వెయ్యటంలోనూ 20 వేల అడుగుల చిత్రానికి అంచనాలు వెయ్యటంలోనూ తేడా ఉండదంటే ఎవరు నమ్మగలరు? చిత్రనిర్మాతలు తాము షూట్‌చేసి నెగటివ్ ఎడిట్‌చేసిన తరవాత ఎంత అయ్యేదీ బొత్తిగా అంచనా కట్టలేకపోతే వాళ్లు పరమ అసమర్థులనుకోవాలి. ఒకవేళ నెగటివ్‌లో గాని సౌండ్‌లో గాని, లేక షీట్స్

ద్ధంజేసి ఘనవిజయాన్ని సాధించినై. కదనరంగమైన సంధ్యాకాశం రక్తంలా ఎర్రనైంది. సంధ్యాకాశం లాగుంది సరోజిని మోము. సమావేశం ముగియాక ముందే రమేష్‌రాముకు బయలుదేరాడు రెండురోజుల నుంచి నిద్రలేమిచే బడలికవల్ల. అదను జూచి సరోజిని చంపభుజంపై చేయూతగా నిల్చి రాముదగ్గరకు రాగనే ఫెళ్లున చెంపపై చాచి కొట్టింది. మీటింగు హాలులోనుంచి కరతాళధ్వనులు విన్పిస్తోన్నై. గిర్రున నీళ్లుతిరిగినై ఇద్దరికళ్లల్లోను. ఆనంద బాష్పాలో అవమాన........



లోగాని ఆదా లేదని అనుకున్నా పాజిటివ్‌లో బోలెడంత ఆదా ఉండటం స్పష్టం. దక్షిణ దేశంలో ఒక్కొక్క చిత్రానికీ 15 నుంచి 20 కాపీలవరకూ తీస్తున్నారు. ఎక్కువచిత్రాలు 17, 18 వేలమధ్య పొడవు ఉంటున్నాయి. మాట వరసకు ఈ పొడవు 14,15 వేల మధ్య ఉండాలని నిర్బంధం ఉన్నట్టయితే పాజిటివ్ ఒక్కొక్క చిత్రంమీదా దాదాపు అర లక్ష అడుగులు ఆదాఅవుతున్నది. ప్రింటింగు ఖర్చులూ, టిన్నులరవాణా ఖర్చులుకూడా అంతవరకు ఆదాఅవుతాయి. దక్షిణదేశంలో ఏటా 40 చిత్రాలు తీస్తున్నారనుకుంటే దాదాపు 20 లక్షల అడుగుల పాజిటివ్ ఆదా చెయ్యవచ్చునన్నమాట. దేశమంతటా చిత్రాలపొడవు పరిమితం చేసినప్పటికీ చిత్రాలకయే ఖర్చు తగ్గదని ఫిలిం విచారణసంఘం నమ్మటం అతి విచిత్రం.

మరొకవాదం—ఇదీ వాసన్‌గారిదే—చిత్రాలపొడవు పరిమితం చెయ్యటంచేత కళాకారుడికి - అంటే చిత్రనిర్మాణ వ్యాపారం చేసే నిర్మాతలకు - సృష్టి స్వాతంత్ర్యం పోతుందని! మన చిత్రనిర్మాతలు కళాదృష్టితోనే చిత్రాలు తీస్తున్నారన్న విపరీతవాదాన్ని ఆమోదించినా ఈ కళాదృష్టిఫలితంగా పొరపాటున అయినా 10 వేల అడుగుల చిత్రాలూ, 30 వేల అడుగుల చిత్రాలూ ఎందుకు రావో ఎవరూ చెప్పటం లేదు. పైపెచ్చు కొందరు చిత్రనిర్మాతలు-ముందుగా అంచనా వేసుకునే శక్తి చాలనివాళ్లు-తాము తీసిన చిత్రం పొడవు చాలక కొత్తసన్నివేశాలు తయారుచేసుకుని షూట్‌చెయ్యటమూ, తీసిన చిత్రం ఏ 22, 28 వేలకో పెరిగి చిత్రంలో ఉండాలని-కళాదృష్టితోనే అందాం-నిర్ణయించిన సన్నివేశాలను కత్తిరించి పారెయ్యటమూ జరుగుతున్నట్టు వింటున్నాం. దీన్ని ఎట్లా సమర్థించటం. చిత్రం పొడువు కథనుబట్టి ఉండాలన్నది కళాదృష్టితో చూస్తే చాలా సబబైనదే. ఎవరూ కాదనరు. కాని అవతల సంఘటనలు హెచ్చుగా ఉన్న చిత్రం దీర్ఘంగా ఉండి బాగా నడుస్తుంటే ఇవతల సంఘటనలు తక్కువగా ఉన్న చిత్రం తీసినవాడు తక్కువ పొడుగు చిత్రాన్ని తీసి విడుదల చేస్తాడా? చెయ్యడు అది వ్యాపారపద్ధతి కాదు. చిత్రాల పొడవును నిర్ణయించేది వేరే ఉన్నది; కాని అది కళాకారుడి స్వాతంత్ర్యంమటుకు కాదు-వ్యాపారపోటీ.

మరొకవాదం-ఇదీ వాసన్‌గారిదే-దేశీయభాషలకూ, మన నటీనటుల ఉచ్చారణకూ, కదలికకూ సంబంధించినది. పాశ్చాత్యచిత్రాలలో నటీనటులు మాట్లాడినంత వేగంగా మన నటీనటులు మాట్లాడలేరు. కదలలేరు అని! "ఇంగ్లీషుచిత్రాలలో చెప్పే సంభాషణలే మన నటులు మన భాషల్లో చెబితే ఇంకా ఎక్కువ పుటేజ్ మింగుతుంది" అని ఫిలిం విచారణసంఘం వారు వాసన్‌కు ప్రతిధ్వనిగా అంటున్నారు. కాని ఈ సమస్య ఎక్కడ ఉద



సారథీవారి "అగ్నిపరీక్ష"లో

 శ్రీమతి రాజ్యం 

యిస్తున్నదో తెలియదు. మన నిర్మాతలు ఇంగ్లీషు చిత్రాలను తమిళంలోకీ, తెలుగులోకీ తర్జుమా చెయ్యటంలేదు. ఇంగ్లీషు చిత్రాలలో ఉన్న సంభాషణలన్నీ మన చిత్రంలో ఉండటంలేదు. కామెరా ఎదట పాశ్చాత్యనటులు కదలినంత మన నటులు కదలటమూ లేదు. ఇదివరకే "బ్లూ లెగూన్" "తీఫ్ ఆఫ్ బాగ్దాద్", "స్టోన్ ఫ్లవర్" వగైరా విదేశీ చిత్రాలు దేశభాషలలో డబ్ చేయబడ్డాయి. ఇతర చిత్రాలుకూడా ఇలాగే డబ్ చేస్తారనే భయాందోళనలు మన చిత్రనిర్మాతలను బాధిస్తున్నాయి కూడానూ. ఈ డబింగ్ విజయవంతంగా అయిఉండటాన్నిబట్టే ఈ వాదం సరి కాదని రుజావవుతున్నది.

వాసన్‌వంటి చిత్రనిర్మాతలు తమ స్వలాభంకొరకు చేసిన ఈ కుంటివాదాలను ఫిలిం విచారణసంఘంవారు తమ వాదాలుగా ప్రభుత్వానికి నివేదించటం చాలా హాస్యాస్పదం.

మిగిలిన విషయాలమాట ఎట్లాఉన్నా చిత్రాల పొడవు 14, 15 వేలకు మధ్యగా ఉండాలని నిర్ణయించటంవల్ల లాభం ఉంటుంది గాని నష్టం ఉండదు.

ఇంటర్వల్‌తో సహా 3 గంటలు మించి ఉండే చిత్రాలు ప్రదర్శించటంవల్ల రోజుకు 3 ఆటలు సుఖంగా ఆడుకునే అవకాశం ఉండదు. సింగిల్ ప్రొజెక్టర్లు మాత్రమే ఉన్న థియేటర్ల సంగతి వేరే చెప్ప నవసరంలేదు. ప్రతిథియేటరూ రోజుకు 3 ఆటలు సుఖంగా ఆడగలిగినట్టయితే థియేటర్ల సంఖ్య పెరిగిన ఫలితం ఏర్పడుతుంది. ఆఖరు ఆట చూసే జనానికి ఆరోగ్యం చెడదు. దక్షిణదేశంలో తయారయే మంచిచిత్రాలలో కూడా 15 వేల అడుగులలోపల తీయటానికి అవకాశం లేని చిత్రాలు లేవు.

ఇంకొక విషయమేమంటే హాలీవుడ్ చిత్రనిర్మాతలు ప్రసిద్ధమైన నవలలను చిత్రాలుగా తీసేటప్పుడు చిత్రాల పొడవు కొద్దిగా పెరగనిస్తారు. అప్పటికీ నవలలో ఉండే అనేకవిషయాలను చిత్రంలో వదిలేస్తారు. తమ పుక్కిటి పురాణగాధలను తామే రచించుకుని, కలగూరగంపలాగ అందులోకి కొత్తగా వెలువడే చిత్రాలలోని సంఘటనలను ఎప్పటికప్పుడు ఇరికిస్తూవచ్చే మన నిర్మాతలు తమ చిత్రాల పొడవుపై తమకుగాని ఇతరులకుగాని ఎట్టి అదుపూ లేదనీ, ఉండకూడదనీ అనటం హాస్యాస్పదం. ఆ వాదాన్ని ఫిలిం విచారణ సంఘం ప్రతిధ్వనించటం మరింత హాస్యాస్పదం. ★

## సినిమా వార్తలు

# శ్రీరాజరాజేశ్వరీవారి సౌదామిని

[తమిళ జానపదచిత్రం]

ఏప్రిల్ 12 ఉదయం మద్రాసు ప్రభాత్ సినిమాథియేటరులో శ్రీ రాజరాజేశ్వరీవారి తమిళ జానపదచిత్రం "సౌదామిని" పత్రికలవారికి చూపబడింది.

విక్రమసేనన్ భార్య సౌదామిని. ఆదంపతులు చాలాకాలం సంతానంకోసం ప్రతి పుట్టకూ చెట్టుకూ మొక్కుతారు. తీరా సౌదామిని గర్భవతిగా ఉన్నసమయంలో విక్రమసేనన్ విలాసవతి అనే నాట్యకత్తె వల్లలోపడి తన భార్యశీలాన్నీ, తన మంత్రి విశ్వాసాన్నీ శంకించి వారికి దండనవిధిస్తాడు. సౌదామినిని తలారులు నరకబోయే సమయాన అడవిలో తుపాను రేగుతుంది. గోపాల్ అనే మనిషి ఆమెను రక్షించి తన వద్ద ఉంచుకుంటాడు. ఆమెగర్భాన ఉదయసేనన్ పుట్టి పెరిగి పెద్దవాడవుతాడు. ఈ ఉదయసేనన్ తిరిగి తన తండ్రిని చేరుకోవటమూ, విలాసవతిచేత వంచింపబడి కళ్లు పోగొట్టుకున్న తండ్రికి కళ్లివ్వటమూ చిత్రంతాలూకు కథ.

ఇందులో ప్రధానపాత్రలను ఎం. కే. రాధా, కన్నాంబ, ఎ. నాగేశ్వరరావు, ఎస్. వరలక్ష్మి, టి. ఆర్. రజని, టి. ఆర్. రామచంద్రన్, సి. వి. వి. పంతులు, దొరస్వామి మొదలైనవారు నటించారు.

దీనికి సంభాషణలు వ్రాసినది "ఉదయకుమార్", పాటలు, కవి లక్ష్మణదాస్; సంగీతం, ఎస్. వి. వెంకట్రామన్; నాట్యం, అనిల్‌కుమార్ చోప్రా; ఆర్టు, కే. ఆర్. శర్మ; డైరక్షను, కే. బి. నాగభూషణం.

ఈ చిత్రం జెమినీస్టూడియోలో తయారయింది.

### కొత్త 'ముహూర్తాలు'

ఏప్రిల్ 7 ఉగాది పుణ్యదినాన మూడు కొత్త చిత్రాలు ప్రారంభించినట్లు తెలుస్తున్నది.

ఒకటి జ్యోతీ ఫిలిమ్సువారి "మరదలు పెళ్లి." కేతరాజు భాస్కరరావు, సినిమా నటుడు ముక్కామల కృష్ణమూర్తి కలిసి ఈ చిత్రాన్ని తీస్తున్నారు. ఇందులో సూర్యకుమారి, ముక్కామల, లక్ష్మీకాంతం, శ్రీరామమూర్తి, జానకి, రత్నం నటిస్తారట. వి. నాగయ్య, బి. శివరాం, టి. సూర్యకుమారి సంగీతం ఇస్తారట.

మరొకచిత్రం భారతలక్ష్మీ ప్రొడక్షన్సువారి "ప్రియురాలు." దీనికి ప్రొడ్యూసరు డి. కృష్ణమూర్తి, డైరక్టరు గోవిందన్.

ఇవికాక లక్ష్మీరాజ్యం స్వంతంగా "దాసీ" అనే చిత్రంకూడా ఉగాదినాడు ప్రారంభించినట్లు తెలుస్తున్నది.

## గ్రంథ సమీక్ష

### "గీటురాయి"

కొత్త వారపత్రిక - ప్రధాన సంపాదకుడు: శ్రీ కోట వేంకటరంగం బి. ఏ.-విడికాపీ 2 అణాలు; సం. చందా రు 6 లు.

ఈ వారపత్రిక తొలిసంచిక మాకార్యాలయం చేరింది. ఈ సంచికలోని సంపాదకీయమూ, ఇతర వ్యాసాలూ స్వతంత్రధోరణిలో ఉన్నాయి. ఒక పక్షాన్ని బలపరిచే ధోరణిలో లేవు. ప్రస్తుతం దేశంలో ఉన్న దుర్భరపరిస్థితుల నెదుర్కొని దేశక్షేమం, ప్రజాక్షేమం సాధించడంతమ ఆశయంగా సంపాదకులు చెబుతున్నారు. "గీటురాయి" ఈ ఆశయాలకు గీటురాయిగా ఉండగలదని ఆశిస్తున్నాము.

---

### పిల్లగాడి పట్టు

పిల్లలకథ; రచయిత: మద్దులూరి రామకృష్ణ; ప్రచురణ: శాంతిప్రచురణలు, బాపట్ల; వెల: 2 అణాలు.

టామ్ అనే నీగ్రో కుర్రవాడు తనకు ప్రియతమమైన ఒక కోతిని తెల్లవాళ్లు ఎత్తుకుపోగా, దానికోసం, దేశాలు పట్టి, కష్టాలుపడి చివరకు తిరిగి సంపాదించిన కథ. పిల్లలకు తేటతెల్లంగా ఉండేటట్లు చక్కని భాషలో వ్రాయబడింది. పుస్తకంలో రంగురంగుల బొమ్మ లున్నాయి; 18 పేజీల చిన్న పుస్తకం.

## గ్రంథస్వీకారం

### పండ్లు

ఐదవభాగం— గ్రామసేవాగ్రంథమాల. కర్త: శ్రీ గోటేటి జోగిరాజు.

ప్రకాశకులు: ఆంధ్రగ్రంథాలయట్రస్టు, పటమట లంక. వెల: రు 4 లు




ఊరి బయట శ్మశానంలో స్తబ్ధంగా, నిశ్శబ్దంగా నిదురించే ఆ సమాధిలో ఉన్నట్టుండి ఏవో కలవరం బయలు దేరింది. అస్పష్టమైన ఏవో... అంతర్ధ్వనులు - ఒకప్పుడు కుక్కలు ఎముకలు నములుతున్నట్టు, మరొకప్పుడు పందులు 'గురగుర' మంటున్నట్టు, ఇంకొకప్పుడు నక్కలు మందలుగా పొదలమాటున పోట్లాడుకుంటున్నట్టు-అగి అగి అలజడులు పుట్టిస్తున్నయ్.

మసగచీకటి. మన్నూ, మిన్నూ ఏకంచేసే వొడుపుతో అంతరాళంగుండా అలుముకు పోతోంది.

ప్రక్కనున్న ఈతపొదలు సూది మొనల చూపులతో చీకట్లు చీల్చుకుంటూ ఉవ్వెత్తుగా, పంతం వేసుకుని పైకి లేచినట్టున్నయ్; తమస్సుకు తడబాటు పుట్టిస్తున్నయ్-

గాలిగాడు (గాలి) గుబ్బలూ, మిట్టలు, గడుచుకుంటూ పడుతూ, లేస్తూ, తూలుతూ తొట్రుపడుతూ సాగలేక ముందుకు సాగి పోతున్నాడు.

ఉండి, ఉండి సమాధిలో చప్పుళ్లు బయలు దేరినై.

అదాటున విని ఉలికిపడ్డాడు గాలిగాడు. వెనకడుగు వేసి వఱ్ఱివాడిలా దిక్కులు పరికించాడు.

సవ్వడులు పెద్దవయినయ్; గాలిగాడికి మరింత భయం వేసింది. మాట పెగల్లేదు-ఓ క్రమాలకి ఆ ధ్వనులలోనించి మానవుని గొంతు వినవచ్చింది. స్పష్టంగా, అర్థమయ్యేలా.- ధైర్యం తెచ్చుకుని అడుక్కు చూసి తీక్ష్ణంగా పరికించాడు గాలి.

"మాస్తావేం నేనే-" ఆ గొంతు గద్దించింది.

"ఎక్కడ నువ్వు?" గాలిగాడి ప్రశ్న.

"ఇక్కడే ఈ సమాధిలో-" మాటకు మాట సమాధానం వచ్చింది. గాలిగాడికి ఒళ్లంతా ధైర్యంతో ఉబ్బిపోయింది.

"ఎవరు నువ్వు?" అడిగాడు గాలి.

"నేనే-" 'నన్ను ఎరగవా?' అన్నట్టు సమాధానం.

"నువ్వంటే?" గాలిగాడు గద్దించి అడిగాడు ఈమారు. "నేనంటే నేనే-నన్నెరగవూ? పోలిసెట్టి వెంకణ్ణిరా" సమాధానం చెవులో కొట్టినట్టున్నది.

క్షణం ఆలోచించాడు గాలి. అంతా ఆకళింపుకు వచ్చింది అన్నాడు. "అరె నీ తస్సాదియ్యా! వెంకడివట్రా నువ్వూ? నా అంతవాణ్ణి ఘడియలో గజిబిజి చేశేశావ్."

"గొంతయినా గుర్తించ లేదురా గాలీ?" వెంకడు అడిగాడు.

"ఊహు-నీ గొంతు...అదోలావుందిరా! మనిషి మాటాడినట్టే లేదు. చప్పగా మారిపోయిందీ! ఆడ, మగ భేదంకూడా తెలీటం లేదురా!" స్తిమితంగా కూర్చుని ఆశ్చర్యంగా అన్నాడు గాలి.

"అవున్లే-అదీ నిజమే. నేను బతికున్నప్పుడు ఎట్టా మాటాడినా ఇప్పుడు పూర్తిగా మారిపోయిఉంటాను-నువ్వా... పంచభూతాల్లో ఒకడవు! నేను పాంచభౌతికమైన శరీరం వదిలేస్తున్నాను. అందుకని నీకు కొత్తగా వినబడినా వినబడవచ్చులే!" అన్నాడు వెంకడు.

"అప్పటికీ ఇప్పటికీ పోలికే లేమూ!" పూర్వపు సంగతులు జ్ఞాపకం చేసుకుంటూ అన్నాడు గాలి.

"అవును. ఇప్పుడు మేం మాటాడే తీరే వేరు. అందుకే మేం అంటే మనుషులు గుండెలు గుప్పిట పెట్టుకుని ఉంటారు. మా చాయలకి రావడానికే బెదిరి బేజారై పోతారు." తన బలాన్నంతా కూడ తీసుకుంటూ సమాధిలోనుంచి వెంకడి సమాధానం.

"సరేగానీ, ఏమిటీ అంత గందరగోళం చేశేశావ్?" అడిగాడు గాలి.

"గందరగోళం లేదు గోడగెడ్డలూ లేదురా! ఓ చెంప నేనేదో దిగులుగా ఆలోచించుకుంటూంటే నన్ను పీక్కుతినాలని కుక్కలు, నక్కలు, పందులు-వచ్చి మేము ముందు తినాలంటే మేము ముందని వాటిలో అవే పోట్లాడుకు చస్తున్నయ్. కూర్చున్న చోటునించి కదలనివ్వవు. నువ్వు ఎక్కడ దాటిపోతావో అని ఆదుర్దా. చూసిచూసి నాకు చిరాకెత్తు

వొచ్చింది. పక్కనున్న ఈతమోడు పెళ్లగించి లుంగలు లుంగలుగా బాది వదిలిపెట్టా...అదీ...ఆ మోత అంతాను" 'అమ్మయ్యా' అన్నట్టు ఒక నిట్టూర్పు విడిచాడు వెంకడు.

"నీకు దిగులేవిట్రా? అయినా దేవలోకంలోకి ఎగిరిపొయ్యేవాడవు ఇంకా ఇక్కడేపడి ఏడుస్తున్నా వెందుకు?" గాలిగాడు గొంతు తగ్గించి నిదానంగా అడిగాడు. "మకేరా. నాతో పాటు వచ్చినవాళ్లందరూ కనుమూపుకందని మేరకు ఎగిరిపోయారు. నేనే ఇక్కడ పడిఏడుస్తున్నా, స్వర్గమూ చట్టుబండలూను. చూడు! ఇక్కడకంటే అక్కడ ఏమంత ఒరిగిందంటావ్? అదంతా వట్టిచవిటిపఱ్ఱ. పోయేవాళ్లందరూ మొత్తే వడమేకదా!"

"అలా అనకు వెళ్లినవాళ్లు అక్కడ సుఖపడతారులే!"

"ఏమో నాకు నమ్మకం లేదురా, ఏమైనాగానీ వెళ్లి ఏడవకతప్పదుగా! నువు ఎప్పుడు వస్తావా, ఆ కాస్త కబురూ చెప్పి వెళిపోదామా అని కనిపెట్టుకు కూర్చున్నా. కడుపురా నాయనా కడుపు-కన్న కడుపు అట్టా ఏడిపిస్తుందిరామరీ!" వెంకడు వెక్కివెక్కి ఏడుస్తున్నట్టు విన్నాడు గాలి.

"ఏడుస్తావెందుకురా పిచ్చివాడా? నేను ఉన్నాగా నీకు కావలసిన సాయం చెయ్యడానికి? చెప్పరాచెప్పు. నువ్వు చెప్పేదేవిటో చెప్పు!" అన్నాడు ఓదార్పుగా.

"నేను అంతా చెప్పేవరకూ ఉంటావురా గాలీ? మధ్యలో ఊడాయించవుగదా! సంశయంగా అడిగాడు వెంకడు.

"నే నెక్కడికీ పోనురా, చెప్పు! చూస్తున్నావుగా వెళ్లలేక వెడుతూన్నా."

"తొందరపనులేవీ లేవుకదా అని:"

"ఇప్పుడేం తొందర ఏడుస్తుంది. చీకటి ఘడియల్లో నెలపొడిస్తే అప్పుడు-అందుకేగా నడిచిపోతున్నానూ!" "అన్నట్టు నీ వాహనం ఏమయిందిరా?"

"దాని దుంప తెగిరి. ఆ లేడిముండ వెన్నెల్లో తప్పితే ఉత్తప్పుడు నా జాయికే రాదు. వచ్చినా ఇప్పుడో కాసేపో అన్నట్టు ఉసూరుమని నడిచి ఏడుస్తుంది. అందుకని ఇండిదగ్గిరే కట్టేశాను. వెన్నెల్లో దానిపరుగే పరుగనుకో! ఆడుమగ-అందరూ మేడలపై అంతస్తులమీద ఎక్కి నాకూ దానికీ కూడా ఊపిరి సలపనిస్తారా? కన్ను మూసి తెరిచేలోపల ఒకసారి భూవలయం పర్యటిస్తూ ఉండాలి! దానికి తోడు ఎక్కడెక్కడ మంచి వాసనలున్నా వీపున గట్టుకు మోసుకుపోవాలి. సముద్రం ఒడ్డున బంగలాల్లో నివసించే పెట్టిపుట్టిన దొరలకి కిటికీల దాకా కెరటాలు జిమ్మాలి-సరే నా సోది ఎంతచెప్పినా తరగదు. ఇప్పుడయినా...అసలువెల్లక తప్పదు. నీమాటలు తొందరగా చెప్పెయ్యి!" వెంకడి యెడ సానుభూతితో అన్నాడు గాలిగాడు.

"నా బతుకంతా నీకు తెలిసిందేకదరా?" చెప్పటం మొదలు పెట్టాడు వెంకడు.

"నాకు తెలియకపోవడ మేవిటి? చిన్నప్పట్నుంచీ నా ఒళ్లో పెరిగిన వాడివికదట్రా నువ్వు?-మండు వేసంగిలో మళ్లుపోస్తే ఎండి ఏరింపులయ్యే నారుకి ఏతాం తోడుతున్నప్పుడు ఎంత కమ్మని పాటలు పాడేవాళ్లురా మంగీ నువ్వూను. కదల్లేక ఓక్షణం మీ ముందు ఆగినట్టు ఆగి ఇట్టే దూసుకుపోతుంటే వాడిని, జ్ఞాపకం లేదూ?"

"ఉండకేం-ఇప్పుడు ఆ రోజులు తల్చుకుంటే..."

"నాకూ విచారం వేస్తుందిరా-ఎండనక, వాననక-కఱ్ఱ బుజాన పెట్టుకుని, కాడి గట్లంట తిరుగుతూ, పచ్చనిపైరు చూసుకుంటూ ఒక్కొక్కనాడు అన్నానికే వెళ్లేవాడివి కాదుగా!"

"ఆ రోజుల్లో అన్నం తినాలనే అనిపించేది కాదురా! పచ్చనిపైరులు పరవళ్లు తొక్కుతుంటే కడుపు నిండిపోయినట్టే ఉండేది!"

"అవును-అప్పుడప్పుడూ అన్నంమూట నెత్తినపెట్టుకుని పొలమొచ్చి నిన్నూ నీ ఆనందాన్నీ చూస్తే మంగికళ్లు మిలమిలా మెరిసిపోయేవి; మీ యిద్దర్నీ చూస్తే నాకు ఒళ్లు పొంగిపొయ్యేదిరా! తరంగాలు తరంగాలుగా పైరుమీద పారాడుతూ, వెళ్లలేక వెళ్లలేక మిమ్మల్ని వదిలి వెళ్లేవాడిని."

"మంగి!-అదీ చచ్చిపోయిందిరా!"

"ఆ. హా...హా...మహాదొడ్డ ఇల్లాలురా అది."

"చివరికి ఎంత నికృష్టంచావు చచ్చిందిరా! చలిజరంవచ్చి సుక్కిశల్యమైపోతే చూసే దిక్కు లేక, గుక్కెడునీళ్లుపోసి గొంతు తడిపే హంగులేక అలమటించి పోయిందిరా."

"అవునురా పాపం! ఆ నాడు అరుబయట పెట్టుకుని పేగులు కోసుకుపోయేలా కళవళంగా నువు ఏడవటం, నా జన్మలో మర్చిపోగలన్రా? తల్చుకుంటే ఇప్పుడు తరుక్కుపోతై నా గుండెలు."

"ఆ నాటితోనే నా దీపం ఆరిపోయిందనుకో!"

"పోక ఏముందిరా మరీ!"

"సొంతం చేసుకునేవాడయినా అట్టా చేస్తాడూ? నువ్వేరగవ్ వాడి పనులన్నీ ఎట్టా చేసిపెట్టేవాడినో."

"ఎరుగున్నా వాడి పనులు నేనుమటుకు చెయ్యలేదూ? కుప్పలు నూర్చినప్పుడు పొల్లంతా ఎగరగొట్టి కళ్లంలో కణికల్లాంటి ధాన్యం రాసులుపోయించింది నేను కాదూ?"

"బంగారం రాగాలీ!-బంగారం రాసులు పోసి గాదెలు నింపాను. అయితేయేం నా పచ్చంగడుపుకో దానికి జొక్కడు మెతుకులకే మొహం వాచిపోయాను చివరి రోజుల్లో."

"అవును పాపం! చివరికి ఏం జరిగిందేవిటి? నే నంత శ్రద్ధగా వింటంలేదు ఈ మధ్య."

"జరిగేదేముంది? అంతా చెబుతా విను-నా కొడుకు రంగ మెల్లడం తెలుసుగా!"

"వాడు-పెద్దవాడు?-"

"పెద్దా, చిన్నా-అన్నిటికీ వాడు ఒక్కడే కదురా నాకు?"

"అవునవును. అప్పుడు పెద్దపడవలో యెక్కి వెడుతూంటే నేనే తోసుకు వెళ్లినట్టు జ్ఞాపకం."

"వాడు వెళ్లి ఇన్నేళ్లయినా నాకేవీ కష్టం అనిపించలేదు. నాది అంటూ చేరెడు నేలలేకపోయినా ఆ పంచనీ, ఆ పంచనీ పడిఉంటున్నా, ఆయన దగ్గిరే కవతంలో జేరాను. నాదే అనుకున్నాను. ఇంత పండించి పోశాను, పెట్టింది తిన్నాను."

"ఏదో అంటావేవిటి? నువు కవ్వతంలో కాలు పెట్టిన ఏడే కోటిలింగం 'కోటలో పాగా' వేశాడనుకున్నా. లేకపోతే పదగూడు బస్తాలు పండించేసరికి ముక్కంబడి నెత్తురు పడేది, ఆ యేడు ముప్పై బస్తాలు మొక్కజొన్నలు పండినయ్యంటే అదంతా నువు కాలు పెట్టిన వేలావిశేషం కాకపోతే మరేవిటంటావ్?"

"వేళా, పాలాను-నిజానికి గాలీ! అట్టాగే ఒళ్లెరక్కుండా పాటుబడ్డాం, పండించాం, తిన్నాం."

"ఆరోజే మొదలు-వచ్చీ, వచ్చీ పాపం పెరిగినట్టు పెరిగివచ్చింది అప్పుంతాను. ఇదంతా నిజానికి నీది కాకపోతే మరెవరిదిరా?"

"ఆ మాట అనకు! పీక పిసుకుతాను కోటిలింగం.

"నాకేం భయంరా, ఇక్కడే కాదు, ఈ ప్రపంచంలో ఏమూలనైనా బాకా వూది మరీ చెబుతాను."

"ఇట్లాగే గడిచిపోతోంది. పనో,పాట్లో చేసుకుంటూ పొట్ట పోసుకుంటున్నాం. నెలకి నాలుగో అయిదో రంగంనించి వాడూ పంపుతున్నాడు. కొస్త కుదుట బడ్డదికదా-అనుకున్నానురా, సంసారం."

"అవును-నువు ఆనాటిరాత్రి వెన్నెట్లో, పంటకళ్ళంలో ధాన్యంరాసిమీద వెల్లికిలా పడుకుని ఈ ప్రపంచాన్నే మరిపిస్తున్నట్టు ఏవో పాటలు పాడావురా! నేను వేగంగా ఎగిరిపోతూ విన్నాను, విని అప్పుడే అనుకున్నా, వీడికి జీవితంలో కొ పెద్దఆనందం కలిగిందని."

"ఆనాడు రా గాలీ! నేను గుండెలమీద చెయివేసుకుని నిశ్చింతగా ఒక్కఘడియసేపు ఆదమరిచి పడుకున్నాను. అయితే ఏం? నాబోటి 'చవుటగాళ్ల మొహానికి' ఎంతసేపు నిలుస్తుందని ఆ ఆనందం? - పొలానికి అప్పుడే కబురొచ్చింది. 'మంగి కష్టపడుతోంది, తొందరగా ఇంటికి రమ్మ'ని. కళ్ళంలో మేలురాసి వదిలి యెట్లా వెళ్లను. కబురుచెప్పొచ్చిన మా బావమరిదిని అక్కడుంచి ఇంటికి పరుగెత్తాను, అప్పటికే అంతా అయిపోయింది - మంగి కననూకన్నది, ఇద్దరు కవలపిల్లలు ట్టారు. ఒకత్తె చచ్చిపోయింది. ఇంకొకత్తె ఇప్పుడో కాసేపటికో అన్నట్టు గుటకలు ంగుతోంది. మంగి మనలోకం తెలియకుండా పడివుంది.

"ఇదంతా నాకు తెలీదు కాని, తరవాత కొన్నాళ్లకి అనుకున్నాను, నువు పాలు తీసుకువెళ్లి శ్మశానంలో ఓగోతిలో పోసి వస్తుంటే - ఎవరో పాలుకుడిచేపిల్ల చచ్చిపోయివుండాలి' అని."

"అప్పుడు అడిగావ్ నా పాట్లు! కుప్పలు సొంతంనూర్పు లేదు,కవటంగింజలు ఇంటికిరాలేదు. నావుంకి తెచ్చినబస్తా వొడ్లు అయిపోయినై - అక్కడాఅక్కడా అడిగి తీసుకువచ్చే మంగి మూలపడింది. వాతం దొమ్మ, తిప్పుకోవాలి, అందుకు మందిప్పించాలి, చావగా బతికిన ఆ పిల్లని బతికించాలి - నాకు ఎవరు పలుకుతారు? పిల్లని ఎవరు బతికిస్తారు? దెబ్బమీదదెబ్బ తగిలిందనుకో! తలదిమ్మెక్కిపోయింది."

"ఆపదలు ఒక్కసారే ముంచుకు వస్తయ్‌రా!"

"డబ్బు కావాలి, చేతులో ఎన్నియే గానీ లేనిది ఎవరు పలుకుతారు? కోటిలింగంకొట్టాంలో యెంతఉంటేనేం?"

"ఏమైనా అన్నీ దిగమింగుకుని ఆయన కాళ్లమీదనే పడదామని వెళ్లాను. సంగతి చెప్పాను. శాంతికరూపాయిలు ఓబస్తాగింజలు ఇప్పించమన్నాను. 'మానూలంతా కావాలన్నాడుః' ఇంట్లో పెళ్లాం పిల్ల, మందులేక మురిగిచస్తున్నా, రన్నాను. "కావాలంటే కాయితంరాసి తీసుకెళ్ళమన్నాడు-" వెంకడిగొంతు ఓ క్షణం పాటు బొంగురుపోయినట్టుంది.

"వాడిగుండె నల్లరాయి కొలిచి చేసినట్టున్నాడు."

కోపంతో పళ్లుబిగించి అన్నాడు గాలి.

వెంకడు గొంతుసవరించుకుని తిరిగి చెప్పడు పోతున్నాడు.

"ఆ కాగితం కరామత్తులు నేనింతవరకు ఎరగను, అదేదో నిగారే తగలెయ్యండన్నాను. తల ఊగించి 'ఊ' కొట్టి ఊగుతున్నాడు. నాకుగుండెల్లో దడప్రారంభమయింది. నోరు తడిఆరిపోతోంది. నాలుక పిడచకట్టుకుపోతోంది. 'లేకరేం, అని ఒక్క అగుప్ర అరిగాను వొళ్లు తెలియకుండా. ఏం రాశాడో, మరేంచేశాడో... ముప్ఫై రూపాయిలు తెచ్చి నాచేతిలో పెట్టి, 'తీసుకువెళ్ళరా' అన్నాడు. ఒక్క అంగలో ఇంటికొచ్చివాలాను తరవాత ఆ తలీ, పిల్లలో నేను పడ్డఅగచాట్లు దేవుడికెరుక. కూటికి గుక్కెడుమొహంవాచి వేళకి పాలకి తిండిలేక 'గావుతప్పికన్ను లొట్టోయి' నేనువుంటే పనిలోనికివెళ్లని రోజులు నాగాలుకట్టినాడు. ఏలాగైనా కానీ ఇచ్చే కవతంలో ముష్టింగింజలు తరగొట్టాడు. ఈ వజాన నన్ను మహాపీడిపించుకుతిన్నాడు. ఎంతఉసురుపట్టానో... అయినా మగోఅయ్యగ దగ్గరకివెళ్ళకుండా అక్కడే కనిపెట్టుకుని ఉన్నాను.

"పదిహేనేళ్లయింది. తరవాత ముసురు ఫుట్టిపోయారు. కడుపూ కాయాకట్టుకుని ఆ పిలని ఎలాగో బతికించుకున్నాం."

"అవును. నీ కూతురు నీరమువుండే అది నిప్పంటి పిల్లరా!" గాలిగాడి గొంతులో వాత్సల్యం పొంగి పొరలింది.

"షావుకారు కోటిలింగం నన్ను ఒక అందాన బాగుచేశాడూ? ఇచ్చినడబ్బు తీసుకోడానికి ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువులు నీరుతాగించాడు."

"ఎప్పుడో నా చేతులో ఆడినప్పుడు నాలుగో, అయిదో వసూలేసుకోండని తీసుకెళ్లి ఇవ్వబోతే ఇప్పుడు తొందరేంరా తరవాత లెక్కజూసి చెవుతాలే!" అని చక్కాపోయేవాడు.

"ఏడాదో ఆగునెల్లో గడిచిం తరువాత వడ్డీ పెరిగిపోతోంది ఏమంటావ్? అని కేకపెట్టేవాడు. అప్పుడు నా దగ్గిర డబ్బు నిలవఉంటుందా? మా వాడు పంపిన నాలుగో, అయిదో ఉంటే దేనికో ఒక దానికి ఖర్చయిపోయేది.

"డబ్బుకీగింజకీ కూడా ఎద్దడొచ్చి గిజగిజలాడి పోతున్నప్పుడుఇస్తావా?చస్తావా? అని కూచుంటే నేను ఏంజెయ్యగలను? ఎక్కడ తెచ్చిఇవ్వను?

"అక్కడికీ ఒకసారి ప్రాణంమీదకు తెస్తే పదిరూపాయలు కట్టుకుని పొల్లగానైన పెయ్యను తోలిచ్చా. ఒకసారి ఈన మోపులైన తొలుమారి గేదె పడ్డను ఓకమీద కట్టిపెట్టి తోలించుకువెళ్లి గడిలో కట్టేసుకున్నాడు.

"ఈ పదిహేనేళ్లలోపల ఇట్లాటివి ఎన్ని వరుమానాలు కట్టబెట్లానో...ఊహు-బాకీ చీడా అయిందనేడే. ఏడాదో,రెండేళ్లో అగి వడ్డీ పెరిగిందని ఓ పొలికేక పెట్టడం, నేను పిసుక్కుచావటం....అబ్బబ్బబ్బ...ఈయన బాకీతో నాకు తలప్రాణం తోక్కొ వచ్చిదంటే నమ్మరా."

"అంతేగామరీ చెడిబతికిన ముండాకొడుకు 'ఛీ' అన్నా 'తూ' అన్నా చేస్తో తుడుచుకుని చొక్కాతో రాచేసుకుంటాడు"

"ఆ సమయాని ఏ మారాజునో బతిమిలాడికు త్తరం ముక్క రాయించడమే గాని మా వాడికికూడా రాయించలే, వాడు అక్కడ దిగులుపడి పోతాడని.

"ఈ పదిహేనేళ్ళనుంచీ ఈ తీరున గడిచిపోయింది నాబతుకు. పిల్లపెళ్లీడుకొచ్చింది. ఎక్కడో అక్కడముడిపెట్టాలి. తప్పదు-చేతిలో కాని డబ్బైనా మెసలటంలేదు. ఏంజెయ్యాలి ఇప్పుడు? అని ఆలోచించాను.

"ఏకాడికో ఓకాడికి ఆమేనమామకు ఇచ్చి ముడెడదా మనుకున్నా, తల్లీఅందుకు

ఒప్పుకుంది. కవచంగింజలు కోసం ఎదురు చూస్తున్నాను. రోజులు గడిచిపోతున్నై.

"ఏంచెప్పనురాగాలీ. ఇప్పటికి ఇంత వరకు గడిచి గట్టెక్కాంకదా బయటపడి పోదామనుకుంటే ఎప్పటికప్పుడే ఏదో కొత్తిన వచ్చిపడుతుంది కదా!"

"అదీ నిజమే మరి! ఎవరోతప్ప అందరి బతుకూ ఒకలా తుద నెగ్గడం ఎంతకష్టం?"

"నీకు ఒక్కనికి జాలికలుగుతోంది నా బతుకు వింటూంటే. సరే - మిగతా సంగతులుకూడా చెబుతా విను-!"

"కోటిలింగానికి - ఒక్కడే కొడుకని తెలుసుగా?"

"నాకు తెలియదూ? వెధవ. మొన్న ఉప్పెనగాలికి గండం గడిచి బైట పడ్డాడూ?"

"వాడే - వాళ్లకు ఏం కావాలి? కావలసినంత ఉన్నది. ఎలా ఖర్చుచెయ్యాలో తోచక తెలివితేటలు ఒకొక్కప్పుడు వెత్తి తలలు వేస్తూవుంటాయ్‌లే! కళ్లకు పొరలు కప్పుకుపోయి మన్నూ మిన్నూ కానకండా ప్రవర్తిస్తారు."

"తెలుసురా. నాకు తెలుసు వాడి చేష్టలన్నీ."

"తెలుసుకదా! ఇంక నేను చెప్పేది ఏముంది? అయినా నా సంగతి చెవుతా విను!

"ఓనాడు సాయంత్రం మా వీరమ్మ పొలంనించి ఇంటికొస్తుంటె ఆ తాటితోపు మొగిలో కాచుకుని చేయిపట్టుకు లాగాడు, అనేకవిధాల బలాత్కరించటానికి ప్రయత్నంకూడా చేశాడు."

నాకు తెలీనట్టు చెవుతావేరా, ఆనాడు ఆ చిన్నది ఎన్నివిధాల ఎదిరించిందనీ, అసహాయస్థితిలో ఉండికూడా? గిల్లి, కరిచి, రక్కి-వాణ్ణి ముప్పతిప్పలూ పెట్టింది. కాని, మొగవెధవకాదూ అదొక్కత్తే ఏం చెయ్యగలదు? పెద్దగా అరిచింది. ఆ తాటితోపులో 'వో' అని ప్రతిధ్వనించింది. నేను తొందరగా పడిపోతున్నాను. ఏంజెయ్యాలో తోచకపోతూపోతూ ఒక ఎండుకమ్మ విసిరికొట్టాను. దానితో వాడి చెయి అంగుళంలోతు తెగిపోయి నెత్తురు వరదలైంది. మా వీరమ్మ పారిపోయి వచ్చింది."

"ఆనాడు నువ్వేకనుక ఆపాటిసాయం చేయకపోతే ఏమిజేసేవాడో కదా దుర్మార్గుడు! ఇంటికివచ్చి నాతోనూ తల్లితోనూ చెప్పి వలవలా యేడ్చింది. ఏంచెయ్యగలం?

"అన్నిహంగులూ వాళ్ల అధీనంలో వునయ్, ఎదిరించి ఏంచెయ్యగలం? మింగి ఊరుకుందామంటే కడులో రగిలి పోతోంది మంట 'ఏమిటిగతా?' అని ఆలోచించుకుంటున్నాను.

"మా వాళ్ల అందరిలోనూ ఈ మాట పాక్కిపోయింది. నేను ఊరుకుంటే వాళ్లు ఊరుకుంటారా? నాబావమరిదికి తెలిసింది. అందరినీ కూడగట్టుకువెళ్లి 'ఇదిఅక్రమం. అని కేకలు వేశారు. దౌర్జన్యానికి దిగారు. ఏం కొనసాగుతుంది? మరో క్షణంలో పోలీసుల తుపాకిదెబ్బలకి ఇద్దరిప్రాణాలు బలి అయినయ్. మిగతావాళ్లు ఈ నాటికీ ఖైదులో మగ్గుతూనే వున్నారు.

"ఆ నాటితో నాకవచం ఊడిపోయింది. తల్లీ, పిల్లనూ ఎలాబతికించాలి-మాకడుపులో కూడుపెట్టి పెంచుకున్నామే! ఒక్కగానొక్క ఆడపిల్లగదా అది! మతోపాటు తినీ, తినికా మాడిచస్తుంటే చూసిఎలా వూరుకోగలం?"

"నాకు కడుపు తరుక్కుపోయింది, కొడుకు పంపించే అయిదారు రూపాయలు బాకీ తీర్చటానికి చాలటంలేదు. వడ్డీ పెరుగుతోంది పాపంపెరిగినట్టు. ఏపనో పాడో చేసుకుని కలో, గంజోతాగి చావకుండా బతికివున్నాం ముగ్గురమూ."

"నాలుగు నెలలు గడిచినై. మన్యజ్వరాలు మావూరంతా వ్యాపించినయ్. ఇంటింటికీ, మనిషి మనిషినీ- పట్టి, పీల్చి, పిప్పిచేస్తున్నయ్. మందా?, మాకా?- ఆయువుగట్టిగా ఉండి బతికినవాళ్లు బతుకుతున్నారు, పోయినవాళ్లు తుడిచిపెట్టుకు పోతున్నారు. మా మంగి ఆజ్వరంతోనే తీసుకుని చిక్కిశల్యమై ఆ బిడ్డను నాకు వదిలి పెట్టి వెళ్లిపోయింది. అది పోయినాలుగు నెల్లు గడిచాయో లేదో, నేనూ మంచాన బడ్డాను. వారంరోజులకే కలరా తగిలి చచ్చిపోయాను. ఇదుగో! ఇక్కడ పూడ్చిపెట్టారు నన్ను-"

"నా బిడ్డ వీరమ్మ బతికిఉంది. దిక్కులేనిదానిని ఎవరుచూస్తారు? ఎలా బతుకుతుంది? నా కొడుకు దూరానవున్నాడు. వీరమ్మ పుట్టింతరవాత వాడు ఎరగనే ఎరగడు. ఈసంవత్సరమే వేసవికాలం నాటికి డబ్బుతీసుకు వస్తాను అమ్మాయి పెళ్లిచేదాం. నా పెళ్లిచేసుకుంటాను. అని ఏనాడో రాశాడు. అమ్మా, నాన్నా - చచ్చిపోయారని వాడికి తెలీయదు. ఉత్తరంముక్కైనా రాయించే వెసులుబాటు దొరక్కుండానే, నేను చచ్చిపోయాను. ఇదంతా వినివాడు ఎంత ఏడుస్తాడో..."

"ముందు నా బిడ్డగతి చూడాలి. ఈ ప్రపంచంలో వాడుతప్పదానిని మాసే దిక్కు ఎవరూ లేరు. ఇట్టాగే కొంతకాలం ఉంటే అదీ ఏన్యమ్మో, గొయ్యో చూసుకుంటుంది. మావాడు ఖైదునించివస్తాడని ఎదురుచూస్తుంది. ఈలోగా ఈదుర్మార్గుడు ఇంకా యేం అఘాయిత్యం చేస్తాడో...."

"నాది కన్నపడుపు కనక దాని పాట్లు తలుచుకుంటే ఋమిలిపోతున్నాను. కాని ఏంచెయ్యగలను? నేనూ ఇక్కణ్ణించి వెళ్లి పోవాలి. నాకు సమయందాపురించింది. మాట తడబడిపోతోంది. ఇంతకాలం నీకోసమే బిగించుకు కూచున్నాను. నేనువెళ్లి పోవాలి గాలీ! నాబతుకులో జరిగిందంతా నా కొడుక్కి వినిపించు! నిన్నేనమ్ముకున్నానుగాలీ."

"నువ్వే వెతికి పట్టుకోవాలి రంగంలో, నాకు తెలీదుకదా! దిక్కులేని నాబిడ్డను కాపాడమని కబురుచేశానని చెప్పు! పిల్లలు దిక్కులేక అలోలక్ష్మణా అని అమటించి చచ్చిపోతోందని చెప్పు! వెళ్లు గాలీ! తొందరగా బయల్దేరి వెళ్లు! నాబిడ్డ చచ్చిపోకుండా చూడు. నీకువప్పగించి పోతున్నా. నా బిడ్డకనబడని ఏదోపాడు లోకంలోకి పోయిపడుతున్నా. అదుగో దుర్మార్గులు నన్ను పిలుస్తున్నారు. నేను వెళ్లి పోవాలి. నా బిడ్డనిచూడు గాలీ!"

"నేను ఇప్పుడే వెడుతున్నాను. అదుగో నీకొడుకు రంగంలో ఒక దొరబంగళామీద కూర్చుని ఎవరితోనో కబుర్లాడుతున్నాడు. నాకు కనబడుతున్నాడు - ఈ క్షణంలోనే నేను నీకబురుచెపుతాను. నాలోమాన్యం నశించిపోయింది. నెలపొడిచింది. సహానాన్ని పిలిచాను. ఇదిగో వచ్చిందికూడా, రెప్పపాటు కాలంలో. నీ కొడుకు దగ్గర వాలుతాను. దిగులు పెట్టుకోకు..."

"నిన్నే నమ్ముకున్నాను గాలీ!" ఇక వినబడలేదు వెంకడిగొంతు. సమాధిలో అట్టడుక్కు వెళ్లిపోయింది, ఏదో సన్నని నాదం.

లేడి వాహనంఎక్కి గాలిగాడు రివ్వున ఎగిరి పోయాడు.

అంతవరకూ నిక్కిపొడుచుకు వింటున్న ఈతచెట్లు ఒకసారి తలలు ఆడించి 'సుయ్' మనిచిన్న సవ్వడి చేసినయ్.

సమాధులన్నీ చల్లని వెన్నెల్లోస్నానం చేసి సుఖంగా నిదురోతున్నయ్.—





# సాహిత్య సింహావలోకనం



## అంధవిశ్వాసాలు

నేను 1950 సంవత్సరములో చదివిన కథలలో సెప్టెంబరు 'సమీక్ష'లో ప్రచురింపబడిన 'సులోచన' గారి 'అంధవిశ్వాసాలు' అన్న కథ ఆ సంవత్సరపు వుత్తమ కథలలో నొకటి. భగవంతునిగూర్చి కొంత మందిలో పాతుకుపోయిన అంధ విశ్వాసాలు అందులో సమగ్రంగా వ్యక్తం చేయబడి, ఆ విశ్వాసాలవల్ల చివరకు యేగతి పట్టినదీ ఆకథలో వ్యక్తికి- వివరించబడివుంది. రచయిత ఆ విశ్వాసాలు గల మనుష్యుల్ని బాగా తరిచితరిచిచూసి,అర్థంచేసుకొనికథరచించినట్లు కనబడుతుంది- భగవంతుడు తమకు ప్రత్యక్షమౌతాడు. కోరికల్ని సఫలీకృతం చేస్తాడు; అన్న అంధవిశ్వాసాలుకల వ్యక్తులకు ఆకథ ఎదురుదెబ్బ కొడుతుంది. అందులో రచయిత పాఠకులకు అందించిన- (ఆ రకం మనుష్యుల్ని గురించి) 'ఫిలాసఫీ' కూడా మెచ్చుకో తగినదే.

యం. సుబ్బారావు, తెనాలి.

---

## లైంగికేయుడు

1950 లో అభిసారికలో వచ్చిన "లైంగికేయుడు" అన్న కథ చాల గొప్పగా వుంది. పశుకామానికి ప్రాధాన్యాన్నిస్తూ లక్షలాది యువకుల అచ్యుతహృదయాలను విషపూరితం చేసే డాఫర్ రచయితలకిది చెంపపెట్టు! ఒక్క వారంగోజులు భర్త దూరంగా వుంటేసరి, పచ్చి పశుకామంతో పరాయి మొగాడితో లేచిపోతారని తమ కథానాయకల్ని అతి హీనంగా, చవకపారుగా సృష్టించి, సంఘాన్ని కలుషితంచేస్తూ, తానొక గొప్ప స్త్రీజనోద్ధారకుడైన విప్లవరచయిత లాగా గర్వపడే లైంగికేయుడికి— సంసార జీవితంలో వట్టికామమే ప్రధానంకాదనీ, దానికంటే యెన్నోరెట్లు బలమైన ప్రేమబంధాలు పెనవేసుకు వుంటాయనీ జ్ఞానబోధ జరుగుతుంది. అప్పటినుంచి ఆ లైంగికేయుడి పూర్వపు నైచ్య దృక్పథం మారిపోతుంది. ఇది దాసరి సుబ్రహ్మణ్యంగారి రచనలన్నింటిలోకి అత్యుత్తమ రచన.

## ఇలియట్

'భారతి' లో టి. యస్. ఇలియట్‌ను గురించి పిలకావారు రాసినవ్యాసం అతి సమగ్రంగా వుంది. ఇది ఆ మహాకవి ప్రతిభవిశేషాలను సంపూర్ణంగా చిత్రించిన ఉత్తమవ్యాసం.

## వ్యక్తావ్యక్తం

తరువాత, స్వతంత్రలో వచ్చిన 'వ్యక్తావ్యక్తం' అన్న 'సులోచన' గారి కథానిక శ్రేష్ఠమైనది. ఇందులో అన్నపూర్ణ అనే పల్లెపడుచు తను మనసారా ప్రేమించిన యువకుణ్ణి పెళ్లిచేసుకుంటానని తలిదండ్రులతో చెప్పటానికి వెరిచి, చివరికి తన తలిదండ్రులు నిర్ణయించిన పెండ్లికొడుకుని చేసుకోవటానికి మనస్సు అంగీకరించక ఒకనాటి అర్ధరాత్రి నగలూ-బట్టలతో తన ప్రియుడితో లేచిపోవటానికి సిద్ధమౌతుంది. అదేసమయంలో ఆమె తండ్రి సజల నేత్రాలతో ఆమెని తన కుటుంబ గౌరవాలను కాపాడమని వేడుకుంటాడు. ఆమె మారు మాటాడలేక తన తలిదండ్రుల వంశమర్యాదల రక్షణకోసం,తన ప్రియుణ్ణి సైతం వదులుకుని, తన కేమాత్రం యిష్టంలేని పెండ్లికొడుకుతోనే పెండ్లి చేసుకొంటుంది. విజ్ఞానవిహీనతతో, స్వభావంతో, పల్లె పడుచుల బంగారు జీవితాలు యెలా దుఃఖ భాజనాలవుతాయో యీ రచన గొప్పగా వర్ణిసుంది.

వేమూరు సాంబయ్య.

---

## "మైఁ గరీబ్ హూఁ"

1950 లో చదివిన ఉత్తమ రచనలను పేర్కొనవలసినదని మీరు కోరినారు. నేను చదివిన ఉత్తమరచన కవిరాజ్ మూర్తి (హైద్రాబాద్) గారి "మైఁ గరీబ్ హూఁ" అనే నవల. మూర్తిగారి ఉరుదూ మూలమును శ్రీ గిడుతూరి సూర్యంగారు ఆంధ్రీకరించినారు నేటి సామాన్య మానవుని జీవితముయొక్క కష్టనిష్ఠురాలు యీ నవలయందు చాలా చక్కగా చిత్రింపబడినవి. ధనవంతుని దురహంకారాలు, కార్మికుని కష్టాలు యిందు స్పష్టంగా నిరూపింపబడినాయి. యీ పుస్తకము చదువుతూ వుంటే యిందులో ఉదహరించిన సంఘటనలన్నీ మన కళ్లెదుట జరుగుతున్నట్లు గోచరిస్తుంది.

క్రితం సంవత్సరంలో తెలుగు స్వతంత్రలో ప్రచురింపబడ్డ "లూసియానా భోగిమంటలు", "కుముద్వతి", "అరుగుమీది ఆకలి" అను కథలు వుత్కృష్టంగా వున్నాయి. "లూసియానా భోగిమంటలు" అనే కథలో ప్రజాస్వామిక దేశమని డబ్బావాయించుకొంటున్న అమెరికా దేశంలో తాము చేయని తెల్లజాతి స్త్రీ మానభంగాలకు నిందారోపణ చేయబడి నీగ్రోలు యెట్లు అమానుష చిత్రవధల్ని పొందుతున్నారో, అమెరికన్ల ప్రజాస్వామ్యపు "రంగు" యెటువంటిదో చక్కగా చిత్రింపబడ్డది. "కుముద్వతి" అనే కథానికలో "జీవిత ప్రపంచంనుండి కాందిశీకుడై"న ఒక విరహజీవియొక్క గత జీవితస్వాప్నిక ప్రేమానుభూతులు మనోహరంగా చిత్రించబడ్డాయి.

"అరుగు మీది కల" అనే రచనలో అమరశ్రీ నిరుపేదకుటుంబంలో పుట్టి పత్రిక లమ్ముకొని జీవించే కుర్రవానిగా తన జీవితాన్ని ప్రారంభించి, క్రమంగా కార్మికోద్యమంలో వున్నతిలోనికి వచ్చి పేదలరాజ్య నిర్మాతయైన ఒక యువకుడి జీవితాన్ని చక్కగా చిత్రించాడు. ప్రజాజీవితాన్ని చక్కగా ప్రతిబింబించే కథల్లో యిది పకటి.

కె. వెంకటేశ్వరరావు.

ఇప్పనపాడు.

---

## అన్నపూర్ణ

డిశెంబరు 'భారతి'లో శ్రీ బలివాడ కాంతారావుగారు రచించిన "అన్నపూర్ణ" అనే పెద్దకథ చాలా ఉత్తమముగా యున్నది. ఇందు రచయిత సాధారణమయిన కుటుంబాలలో సర్వసామాన్యముగా జరుగు విషయమును కథావస్తువుగా తీసుకొని అతి సహజంగాను, హృద్యంగాను చిత్రించారు. ఎడముఖాలు, పెడముఖాలు పెట్టుకొని, అభిప్రాయభేదములవలన దూరదూరముగా పోతున్న ఇరువురు సహోదరులను ఏకముచేసి, ఆ యింటి గౌరవమును నిలబెట్టుటలో ఆ యింటి పెద్దకోడలు 'అన్నపూర్ణ' నిర్వహించిన పాత్ర ప్రశంసాపాత్రము. అటువంటి పాత్రను చిత్రించిన రచయిత ధన్యుడు. ఆ కోడలు కోడళ్ళకు నొక ఆదర్శజీవి.. ఆ కథానిక కథాసాహిత్యానికి నొక మణి.

'రాధాకృష్ణ'

---



# ఆంతర్యాలు

శ్రీ వంగల వేణుగో

శవులంటే అందరిలాంటి వ్యక్తి కాదు. సమస్తమూ యెరిగినవాడు. భగవంతుడన్నా, భాగవతులన్నా, సాష్టాంగపడి సాపాటుకి పిలుస్తాడు. మళ్ళీ లౌకికరీత్యా, యివేవీ లెక్కచెయ్యడు (ఆయన ఆ ఊళ్ళోనే ఆడపిల్లల బడికి హెడ్ మేష్టరు లెండి) సూర్యోదయంతో లేచి, స్నానసంధ్యాదికృత్యాలు చక్కగా నెరవేర్చి, అర్ధాంగి యిచ్చిన అరకప్పెడు బార్లీ జావా తాగేసి (డాక్టర్లు తాగమన్నారు లెండి) తెల్లటిపంచ, కోటు, క్షీరాబ్ధిపట్టుకండువాలతో, ఫాలంమీదిపట్టెవర్ధనాలతో అంతటి మనిషి అల్లా నడిచి వెడుతుంటే బడిపిల్లలంతా హడలెత్తేవారంటే నమ్మండి. ప్రతివారితోను తూచితూచి మాట్లాడుతాడు. పాపం! కష్టవంతు, గుమ్మడి కత్తిపీటకి లోకువయినట్టు, యింతటి కేశవులు తన బావగారికి యిట్టే లొంగిపోయి ఊరుకున్నాడు.

బావగారు మాత్రం సామాన్యులా. ఆయన ఉభయభాషల్లో పండితులు. ఆశుకవిత కందుకుంటే అంతం చూసేదాకా వదలరు. తరతరాలుగా తమకున్న శిష్యసంచారం జేస్తూ, స్వగృహంలో (యిప్పటికి కేశవుల యిల్లే అనుకోండి) అతిశ్రద్ధగా పెరుమాళ్ళ సేవ, నిత్యనైవేద్యం, నీరాజనాలు జరుపుతూ, ఒకవిధంగా కేశవులకి గురుసమానులయ్యారు. కేశవుని భగవద్భక్తీ, రక్తీ చూసి ముచ్చటపడి (అల్లా అని ఆయననే చాలసార్లు అన్నారు లెండి మరి) వీలయినపుడల్లా యితని యింట్లోనే వేంచేస్తూ ఉండేవారు. దీని మూలాన్ని కేశవులకి కొంత అప్పయిందనికూడ వినికిడి. దానికేంగాని కలసిఉన్నన్నాళ్లు, వారే వీరు, వీరే వారుగా కాలక్షేపం చేశారంటే నమ్మండి. కొంతకాలానికి, లోకం వెధవది, ఏదో అనుకుంటోందని బావగారు అప్పుడప్పుడు కేశవులకి పదో పరకో, ముట్టజెప్తూ ఉండేవారు. తరువాత అప్పుడప్పుడు, మీరిచ్చే పైకం, మీ నౌకరు తినే పప్పుముద్దకి చాలదని వాళ్లువీళ్లు అన్నారట. యిల్లాగ అరమరిక లేకుండా ఉండగా, కాలక్రమేణ బావగారు కొంచెం డబ్బు వెనకెయ్యడం, ఆ తర్వాత అదనుచూసి, పదునైన గృహం టపీమనికొనెయ్యడం, అందులో ప్రవేశించడం కూడ జరిగిపోయింది. అప్పటికీ ఆ రెండిళ్లకీ రాకపోకలు సాగుతూనే ఉన్నాయ్. కాని కేశవులు చేసిన ఒక చిన్నపనిలో (మన దృష్టిలో) అవన్నీ బందయిపోయాయి.

ఇందాకే మనవిచేశానుకదండీ, కేశవులు లౌక్యంలో ఏదయినా ఖాతరుచేయడని. బడిఉంచిన యిల్లంతా శిథిలమయి, వానకీ, గాలికీ పిల్లలని తారెత్తించేది, పిల్లలుగల కేశవులు ఆ గుంటల బాధ చూడలేక బిల్డింగు మార్చవలసినదంటూ బోర్డువారికి విన్నపం చేశాడు. అది ఓ పట్టాన తెమిలింది. గాలికీ, వానకీ విన్నపాలు వెళ్లగా వెళ్లగా, ఓ సుముహూర్తాన స్కూలు బిల్డింగు మార్చవలసిందంటూ బోర్డువారు హుకుం జారీ చేశారు. హుకుం అయితే జారీ అయింది కాని యిల్లు ఎక్కడుంది? యిల్లుంటే ఆవరణ లేదు. ఆవరణ ఉంది అనుకుంటే ఇల్లు చాలదు. రెండు కుదిరితే బోర్డువారు భరించరానిఅద్దె. ఈ ఖండసమస్యకి ఒక్కటే ఉపాయం తోచింది కేశవులుకి. తనదీ పెద్దయిల్లే విశాలమయిన సావిడి, పడకగదీ, పడమటగది పెద్దఅరుగులూ బడికియిచ్చేస్తే బాగుంటుంది అనుకున్నాడు. దొడ్లో లంకంత పాక ఉంది. పడమటింటి వసారా దొడ్డీ, యింట్లోవాళ్లకి చాలుననుకొని, బడికి కొంత ఆవరణ వదలి, దొడ్లో దడి కట్టేశాడు. దాంతో యిల్లో లోకము, బడి మరో లోకము అయింది. పడమటింటిలోని పెరుమాళ్లని దొడ్లో పాకలో ప్రవేశపెట్టారు. యింతవరకు అంతా బాగానే ఉంది. ఆయన బళ్ళో ముగ్గురు ఆడటీచర్లు ఉన్నారు. వాళ్లు క్రైస్తవులు. యిక్కడే వచ్చింది చిక్కు.

చిక్కేమిటి మహాపరాధం. 'భాగవతులు మసలేచోటమాలసంపర్కమా. పెరుమాళ్ళని సేవించినచోట మ్లేచ్ఛులు తిరగ



టమా' అంటూ తిసుల్కొన్నారు బావగారు. కేశవులు మాత్రం తక్కువ తిన్నాడా? పెరుమాళ్లు ఎక్కడో దొడ్లో మూల పాకలో ఉన్నారు. వారికీ బడిలో మనష్యులకీ సంబంధం లేదు. బడిబట్టలతో పిల్లలు కూడ పాకలోకి రారు. కనుక ఫరవాలేదు అంటాడు. యీ అనుకోవడాలన్ని ఉత్తరాల మూలంగానే అనుకోండి. అయితే నేం?...ముఖస్తంగాకంటె ఘాటుగానే అనుకున్నారు.

ఆ తర్వాత కేశవులుకి ఒక శ్రీముఖం వచ్చింది. 'యింటిలో మాలటేచర్ల బడి పెడుతూ, మత పవిత్రతకి భంగం సహించావు కనుక, యికముందు నీయింటికి మా రాకపోక లుండబోవు' అని మంగళాశాసన పురస్సరంగా వ్రాయించారు బావగారు. దాన్ని చదవగానే కేశవుల గుండెల్లో రాయి పడింది. ఎంతయినా వియ్యంకుడు (మేనరికం యిచ్చాడులెండి) అయినా మరుక్షణం మనస్సు రాయిజేసికొని 'యీ వెధవ రోజుల్లో పాతికరూపాయిలు అద్దెరూపంగా వస్తుంటే ఎల్లా వదులుకుంటాను. ఒక్కదమ్మిడీ, ఎర్రనిఏగాని, ఎవడయినా యిస్తాడూ? అయినా నాకు మాత్రం భగవద్భక్తి లేదూ? అందుకనేగా, పెరుమాళ్లకి సంపర్కదోషం లేకుండా పాకలో వేంచేయింప చేశానూ! అయిందేలాగ అయింది, నేను యింట్లోంచి బడి తీసెయ్యను. వచ్చినవాళ్ళే వస్తారు,' అని తెగించాడు కేశవులు. యిల్లా అని ఉత్తరం రాయలేదనుకోండి.

కాలం ఒకరీతిగా గడవదుకదండీ. బావగారి రెండో పుత్రుడి వివాహకాలంలో ఆధ్వర్యం అంతా కేశవులిదే. ఆ తర్వాత జరిగిన మనమరాలికి పుట్టువెంద్రుకలు తీయించడం కూడ యితని పెత్తనం కిందే జరిగింది. కొంతమందికి (కావలసిన వాళ్ళే అనండి) అయిష్టమయినా లెక్కచేయలేదు. కాని యిద్దరికీ గుండెల్లో మండుతూనే ఉంది. ఎదురుగా కాకపోయినా పరోక్షంగానైనా వాటి తాలూకు పొగలు విజృంభిస్తూనే ఉన్నాయ్. ఆ మధ్య జరిగిన వైష్ణవ సభల మూలంగా కేశవులున్న గ్రామప్రాంతాలకి వచ్చి కూడ కేశవులింటికి రాకుండా వెళ్ళేవారు బావగారు. అంతదాకా ఎందుకూ? ఆ ఊళ్లోనే పక్కవీధిలో సభలకి వచ్చి, యింటి గుమ్మం తొక్కకుండా, అల్లాగే వెళ్లిపోయిన ఘడియలు రెండోమూడో ఉన్నాయ్.

దాంతో 'యిక ఆయన యింటికి మనం వెళ్ల డాలుకాని, ఆయనమాత్రం నాయింటికి రాడు, అని నిర్ణయానికి వచ్చాడు కేశవులు. యీ గడ్డురోజుల్లో వచ్చే పాతిక రూపాయలు వదులుతాడా యీ బావగారి అతిఛాందసాన్ని మన్నిస్తాడా? బడి యింట్లో ఉండటంమూలాన్ని కనపడని లాభం ఒకటి కేశవులు మరచిపోలేదు. బడిలేని గంటల్లో, బల్లలు, బెంచీలు, కుర్చీలన్నీ యింటి-ఫర్నిచరే నలుగురు చుట్టాలొచ్చినా, రెండు బల్లలు సర్దేసి, దుప్పటి పరుస్తే మంచాలు తక్కువయిన లోటు కనపడేదికాదు. యిల్లా యిహపరాలుగా లాభిస్తున్న యీ బడిని యింట్లోంచి తీసెయ్యడానికి సామాన్యసంసారి, కేశవులుకి యిష్టం లేదు.

ఆ వేళ ఆదివారం సెలవురోజు అవడం మూలాన్ని కేశవులు సావిట్లో ఏదో రికార్డు వ్రాసుకుంటున్నాడు. పిల్లలు బల్లలెక్కి గొడవగా ఆడుకుంటున్నారు. ఇంట్లో అంతా అప్పుడే తిర్లుతిని లోకాభిరామాయణానికి కూర్చున్నారు. అల్లాంటి సమయంలో హఠాత్తుగా, ఆకాశాన్ని చీల్చుకొనిపడ్డట్టు, ఊడిపడ్డారా బావగారు. మంచిఎండలోంచి వచ్చారేమో ఒళ్ళంతా స్నానం చేసినట్టు చెమటలోడుతోంది. ఆయాసంతో రొప్పుతున్నారు. హఠాత్తుగా యింట్లోకి రావడంతో కళ్లు కాస్సేపు చీకట్లుకమ్మి, కొంతసేపటికి సద్దుకోగానె మెల్లిగా ఆ ప్రక్కనేఉన్న బెంచిమీద ఆసీనులయ్యారు బావగారు. అకస్మాత్తుగా

---

జరిగిన ఆయన రాకకి కేశవులు నిర్ఘాంతపడి పోయాడు. కాస్త తమాయించుకున్నాక, 'సాపాటుకి లేవండీ' అందామనుకున్నాడు. కాని వెనక జరిగిన రాద్ధాంతం గుర్తుతెచ్చుకొని ఏమీ అనడానికి తోచక తటపటాయిస్తున్నాడు కేశవులు. బావగారి మొహం మీద బొట్టు లేకపోవడం, యింకా ఆయన స్నానంకూడా చెయ్యలేదని బుజువు చేస్తోంది.

కాని కేశవుల కేమీ పాలుపోవడం లేదు.

కొన్ని నిమిషాలుచూసి 'నేను స్నానం చెయ్యాలి' అన్నారు బావగారు. దాంతో సూచన గ్రహించి, దొడ్లో ఉన్న నూతికి ఒక్క గంతేసి, గుండిగనిండా నీళ్లుతోడి, పాకలో దణ్ణాన్ని వేళ్లాడే రెండు గావంచాలు లాగుతూ, 'ఒసేవ్ యిల్లారా' అని ఏంచెయ్యాలో అర్థంకాక తటపటాయిస్తున్న అర్థాంగిని వంటకి పురమాయించి, బావగారిని స్నానానికి లెమ్మన్నాడు కేశవులు. బావగారు స్నానంచేసి, అమర్చిన చిత్రాసనంమీద అనుష్ఠానాలు తీర్చుకొని, కులాసా కబుర్లుచెప్తూ, నవ్విస్తూ, నవ్వుతూ ఆనాడు సాపాటు చేశారు. దాంతో యిక ఆ రెండిళ్లకీ మళ్లా రాకపోక లేర్పడ్డాయనుకోండి.

ఇంతకీ అనవచ్చే విషయం ఏమిటంటే, తిరిగి బావగారే స్వయంగా కేశవుల యింట్లో సాపాటుచేసే అవకాశం ఎల్లా కుదిరిందోననే. అది మనకీ తెలియదనుకోండి. కాని శ్రీరంగమంతటి దివ్యక్షేత్రాల్లోకూడ హరిజన ప్రవేశమయిందే. యిక ఎక్కడో పాకలో ఉన్న పెరుమాళ్లకి సావిట్లోని మాలచిచర్ల సంపర్కదోషం (ఒకవేళ తగిలితే) తలిగినా ఫరవాలేదని బావగారనుకున్నట్టు మన అభిప్రాయం. అయితే చాలకాలం, అంటే మొన్న మొన్నటిదాకా కేశవుల యింట్లోనే కాపరంఉండి, కొత్తయిల్లు రాగానే, దెబ్బలాడి విడిపడ్డారని అంతా అనుకుంటారను. కాని ఆయనే స్వయంగా యిల్లా చేసి ఉంటారని మూలవర్గాలవారిద్వారా వినికి. దానికేంలెండి వెధవది. లోకులని కాకుల నేరుగా!!



# కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో

(19-వ పేజీ తరువాయి)

హోటల్ యజమానికి దాదాపు నలభైఅయిదేళ్లుంటాయి. పొడుగ్గా బక్కపలచగా ఉంటాడు. కొంకిముక్కు, చురుకు చూపులు, చిన్నికళ్లు దక్షిణప్రాంతవాసి అని తెలుపుతున్నాయి. మాంసభక్షణచేసే జంతువుల మాదిరిగా అతనిపళ్లు తెల్లగా మెరుస్తున్నాయి. వయస్సు ముదిరినా అతనికి జుట్టు నెరుపు పట్టలేదు. గడ్డం ఒత్తుగా పెరిగింది. ప్రతిరోజు ఉదయంనించి సాయంకాలం వరకూ అదేపనిగా గుమ్మంవద్ద ఎండలో నిలవడంవల్ల కాబోలు చర్మం కమలింది. తలకు రుమాలు చుట్టుకున్నాడు. ఇతనే కాడరూస్. ఇతని భార్యపేరు రాడెల్. అనారోగ్యంవల్ల చిక్కి, పాలిపోయి ఉంటుంది. లోజ్వరంవల్ల క్రమక్రమంగా ఆమె సౌందర్యం క్షీణించిందని చూడగానే కనిపెట్టవచ్చును. ఎప్పుడూ మిద్దెమీద తన గది విడిచి వచ్చేదికాదు. పక్కమీదైన పడుకునో, పడక కుర్చీలో ఊగుతూనో నిత్యం సాధిస్తూ భర్తనిఉంటుంది. సాధింపుబాధ తప్పించుకోడానికీ, రహదారి నెవరైనా వస్తూఉంటే చూడ్డానికీ కాడరూస్ ఎప్పుడూ వీధి గడపవద్దనే ఉండేవాడు. భార్య సాధింపులకి అతను ఎప్పుడూ ఇచ్చే సమాధానం ఒక్కటే. "చాల్లే ఊరుకో. ఇది మన కర్మం. తప్పించుకోవాలన్నా తప్పదిది." హోటల్‌లో వ్యాపారం ఏమీ లేకపోయినా అది కనీసం అతనికి ఆశ్రయం మిస్తోందని తృప్తి పడుతున్నాడు.

ఆరోజున కాడరూస్ కోళ్లవంక చూస్తూ గుమ్మంవద్ద నిలబడిఉండగా, అతనికి భార్య పిలుపు వినవచ్చింది. రోడ్డుపైన అటూఇటూ కనుచూపుమేర చూసి, ఎవరూ రావడంలేదనిగ్రహించి కాడరూస్ లోనికి వెళ్లాడు. కాని, అతనక్కడే మరోక్షణం ఉన్నట్లయితే దూరంనించి గుర్రంపైన వస్తున్న ఒక ఫాదరీ కనపడేవాడే. ఎడారివలెఉన్న ఈ ప్రాంతంలో ఈ మధ్యాహ్నపు ఎండవేళ సామాన్యంగా ఎవరూ రోడ్డెక్కరు. ఈ కాని వేళ గుర్రపుబాటు వచ్చి హోటల్ వద్ద ఆగాడు. రౌతు గుర్రందిగి, కళ్ళాన్ని పాతకిటికీ తుప్పకొయ్యకి కట్టాడు. ముఖాన చెమట తుడుచుకుంటూ ద్వారం సమీపించి తలుపుపైన మూడుమార్లు తట్టాడు. నల్లని పెద్దకుక్క ఒకటివచ్చి అపరిచితుని చూసి మొరగసాగింది. ఇంతలో కర్రమెట్లు టకటక మన్నాయి. హోటల్ యజమానివచ్చి ఆ గంతకుని ఆహ్వానించాడు. కుక్కని అదిలించి "ఇది కరవదండి. ఊరికే మొరుగుతుంది. ఫరవాలేదు. దయచెయ్యండి. తమరేం తీసుకుంటారు? ద్రాక్ష సారాయి తెచ్చేదా? ఎండ పేల్చివేస్తోంది," అని, ఫాదరీని నిదానించిచూసి తరవాత, "క్షమించాలి. తమరేం తీసుకుంటారో అదే చెప్పండి," అన్నాడు.

ఫాదరీ అతన్ని వింతగా క్షణంసేపు పరికించాడు. తనని కూడా అతను అలాపరికించడానికి అవకాశమిస్తూ, మాట్లాడక ఊరుకున్నాడు. కాని, కాడరూస్ గుర్తుపట్టిన సూచనలేవీ కనపడలేదు. జవాబివ్వనందుకు మాత్రం ఆశ్చర్యపడ్డాడు. ఫాదరీ అతన్ని సూక్ష్మంగా పరిశీలించి, "మీరేనా కాడరూస్?"

"అవును నేనే" అన్నాడు కాడరూస్ మరింత ఆశ్చర్యపడుతూ, "నాపేరు గాస్పర్డ్ కాడరూస్. తమకేంకావాలి?"

"ఓహో! గాస్పర్డ్ కాడరూస్. అవును. పేరు, ఇంటిపేరు అవే. మైలాన్‌వీథిలో ఇదివరలో మీరు దర్జీవృత్తిలో ఉండేవారనుకుంటాను కాదూ?"

"అవును. కాని, ఆ వృత్తిలో బొత్తిగా కిట్టలేదండి. మార్సెల్స్‌లో వేడి, ఉక్క ఎక్కువవడంవల్ల కాబోలు దర్జీపని వాళ్లు అక్కడ బాగుపడే యోగ్యత లేదండి. వేడంటే జ్ఞాపకం వచ్చింది. గాడ్పు వీస్తోంది. తమ రేమైనా చల్లనిపానీయం పుచ్చుకుంటారా?"

"మంచి సారాయం తెచ్చిపెట్టండి. మనం ఇంకా మాట్లాడాలి."

తరుణం తప్పిపోకూడదన్న ఆత్రుతతో కాడరూస్ తనవద్ద ఉన్న సరుకులోకెల్ల నాణ్యమైనది తెచ్చాడు. ఫాదరీ మేజాపై చేతులుంచి కుర్చీలో కూర్చున్నాడు. కుక్క దూరంగా నేలపై పడుకుని ఓరకంట ఫాదరీని గమనిస్తోంది.

కాడరూస్ సీసా, గ్లాసులు తెచ్చి మేజామీద పెట్టాడు. "మీరు ఒంటరిగానే ఉన్నారా? లేక ఇక్కడ ఇంకెవరైనా ఉన్నారా?" అని అడిగాడు ఫాదరీ.

"ఒంటరిగానే ఉన్నానని చెప్పవచ్చునండి. ఏం చెయ్యను? భార్య ఉంది కాని, సహాయపడదండి. నిత్యం జబ్బే. పాపం."

"ఓ. మీరు వివాహితులన్నమాట" అన్నాడు ఫాదరీ.

"తమరు చూస్తున్నారుగా, నేను భాగ్యవంతుణ్ణికాను. ఎలా కాగలను? నీతివంతుడైనంతమాత్రంచేత ఈ ప్రపంచంలో భాగ్యం రాదు కదండి!"

ఫాదరీ అతనివంక సూటిగా చూశాడు. "అవునండి" అన్నాడు కాడరూస్. "ఏమున్నా లేకపోయినా నేను నీతివంతుణ్ణని మాత్రం చెప్పుకోగలనండి. ఈ రోజుల్లో అమాత్రం చెప్ప

పనేవాళ్ళు ఎక్కడున్నారు?"

"అదే నిజమైతే మరీ మంచిది" అన్నాడు ఫాదరీ. "నాకు ఒక విషయమై గట్టి నమ్మకం ఉంది. నీతివంతుడైనవానికి ఇప్పుడు గాకపోతే త్వరలోనే ప్రతిఫలం అందకపోదు. దుర్మార్గులికి శిక్ష పడకమానదు."

"అలా చెప్పడం మీ ధర్మమండి." అన్నాడు కొడరూస్ నిష్ఫ్రహతో. "ఎవరి అభిప్రాయాలు వారివే అనుకోండి."

"పొరపడుతున్నారు మీరు" అన్నాడు ఫాదరీ. "అది ఇప్పుడే మీకు రుజువు చెయ్యగలను. అయితే ముందుగా నేను వెతుకుతున్నది మిమ్మల్నే అని నాకు రూఢి కావాలి. నా కొక విషయం చెప్పండి. 1814 లో కాని, 1815 లో కాని మీరు డాంటె అనే నావికుని ఎరిగున్నారా?

"డాంటీయా? డాంటీని నేను ఎరక్కపోవడమేమి?" అన్నాడు, కొడరూస్ కొంచెం బిగ్గరగా. అతని ముఖం ఎర్రబడింది కూడా. ఫాదరీ అతని ముఖలక్షణాల్ని అతిశ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. "పాపం. అతను నా ప్రాణ స్నేహితుల్లో ఒకడండి. ఏమైనాడో పాపం. మీ కేమైనా తెలుసా? మీరు అతన్ని చూశారా? ఇప్పుడతను స్వేచ్ఛగా సౌఖ్యంగా ఉన్నాడా?"

"ఉరి కంబమెక్కే శిక్షితులకంటె ఘోరదుఃఖం అనుభవించి, ఆశలు కూలిపోయి, అతను ఖైదులో మరణించాడు."

కొడరూస్ ముఖంలో రంగుపోయింది. తెల్లగా పాలిపోయింది. ముఖం పక్కకు తిప్పుకున్నాడు. చేరుమాలుతో కన్నీరు తుడుచుకోవడం ఫాదరీ చూశాడు.

"పాపం" అని గొణిగాడు కొడరూస్. "అయ్యయ్యో! భగవంతు డెప్పుడూ దుర్మార్గుల్నే కాపాడి పైకి తెస్తున్నాడు. ప్రపంచం మరీ అధోగతి పాలౌతోంది. ఒక్కసారిగా లోకాన్ని భస్మం చేసేస్తే పీడా పోతుంది."

"ఇతనంటె మీకు ఆపేక్ష ఉన్నట్లుంది?" అన్నాడు ఫాదరీ.

"అవును. ఆపేక్ష ఉండేది—ఒక్కసారి ఒక్క క్షణం మాత్రం అతని భాగ్యాన్ని చూసి నేను అసూయపడినమాట నిజమే. అందుకు నన్ను నేను దూషించుకోవలసిందే. కాని, నేను మీ సన్నిధిలో ప్రమాణంచేసి చెప్తున్నానండి. అతనికి పట్టిన దుర్గతికి నే నెంతో పరితపించాను. మీకు అతన్ని తెలుసునా?"

"అతనికి తుది ఘడియల్లో ఉపశమనం కలిగించడానికి నన్నే పిలిచారు."

"అత నెలా చనిపోయాడు?"

"నిర్బంధంలో ముప్పైయేళ్ల మనిషి ఎలా చనిపోతాడు? నిర్బంధంవల్లనే చనిపోతాడు."

కొడరూస్ ముఖం తుడుచుకున్నాడు. ఫాదరీ ఇలా చెప్పాడు. "అన్నిటికంటె చిత్రమైనవిషయం ఏమిటంటే, డాంటె చనిపోయే సమయంలోకూడా క్రీస్తుదేవుని పేరుమీద ప్రమాణంచేసి, తన్ని ఏ నేరానికి నిర్బంధంలో ఉంచారో తనకి తెలియదన్నాడు."

"అది నిజమే." అన్నాడు కొడరూస్. "అతని కెలా తెలుస్తుంది? తెలియదు. ఈ విషయంలో అతను మీవద్ద అబద్ధం ఆడలేదండి. పాపం!"

"అందువల్లనే తాను కనిపెట్టలేకపోయిన ఈమాయ ఏదో తెలుసుకుని, తనకి వచ్చిన అపవాదును తొలగించాలని నన్ను నియోగించాడు." ఈ మాటలు చెప్తూ ఫాదరీ నిశితంగా అతనిముఖాన్ని పరిశీలించాడు. ఫాదరీ మళ్ళీ ఇలా చెప్పాడు: "అతని దురదృష్టంలో పాలుపంచుకున్న భాగ్యవంతుడైన ఒక బ్రిటిష్ దేశస్థుడు విడుదలై వెళ్ళిపోతూ, డాంటెకి ఒక అమూల్యమైన వజ్రాన్ని ఇచ్చాడు. అతను జబ్బులో ఉన్నప్పుడు డాంటె సోదరునివలె పరిచర్య చేసినందుకుగాను వెళ్ళిపోతూ ఈ బహుమతి నిచ్చాడు. దానిని జైలర్లకు లంచంపెట్టడానికిబదులు డాంటె భద్రంగా దాచాడు. జైలర్లకి లంచంపెట్టినా వాళ్లు అది తీసుకొని ద్రోహం చేసి ఉండేవాళ్లేమో! ఎప్పటికైనా విడుదలైతే అది తనకి అపారమైన భాగ్య సంపదలు తెచ్చిపెట్టేదనే ఆశతో దాచుకున్నాడు."

"నిజంగా?" అన్నాడు కొడరూస్. అతనికళ్లు ఈమారు మెరుస్తున్నాయి. "అది అంత విలువైన వజ్రమా?"

"దేని విలువైనా లెక్కగట్టే మనుష్యుల్నిబట్టి ఉంటుంది" అన్నాడు ఫాదరీ. "అది ఎడ్మండ్ దృష్టిలో అంత విలువైనదిగా కనిపించి ఉంటుంది. బహుశా దాని వెల ఏభైవేల ఫ్రాంకు లుండవచ్చును. మీరే చూసి విలువ కట్టవచ్చు."

ఫాదరీ తన జేబులోనుంచి చిన్న తోలుపెట్టె తీసి మూత తెరిచి, వజ్రాన్ని పైకి తీసిపట్టుకుని చూపించాడు. అది చక్కని ఒక ఉంగరంలో పొదిగి ఉంచబడింది. కాంతులు కురిపిస్తున్న ఆ వజ్రంచూసి కొడరూస్ కళ్లు జిగేల్మన్నాయి.

"దీని వెల ఏభైవేలా?" అన్నాడు.

"వజ్రం ఒక్కటీ అయితే. ఉంగరం వెలకూడా తక్కువ కాదు." అంటూ ఫాదరీ దాన్ని పెట్టెలోపెట్టి మూత వేసి జేబులో దాచేశాడు. కాని, అది ఇంకా కొడరూస్ కళ్లలో మెరుస్తున్నట్లే ఉంది.

"ఈ వజ్రం మీవద్ద కెలా వచ్చిందండి? మీకు వారసత్వమిచ్చాడా?"

"వారసత్వం కాదు. సంరక్షుణకి మాత్రం ఇచ్చాడు. ఇచ్చి నాతో ఇలా చెప్పాడు: 'నేను ప్రేమించిన యువతి కాక నాకు ముగ్గురు మంచి మిత్రు లున్నారు. కావలసినవారు మొత్తం నలుగురు. నా గతితెలుసుకుని ఆ నలుగురూ దుఃఖిస్తారు. వారిలో ఒకడు కొడరూస్. రెండోవాడు డాంగ్లర్; మూడోవాడు ప్రతికక్షి అయినా అతిసన్నిహితుడు?"

వికృతమైన హాసం కొడరూస్ ముఖంలో పొడగట్టింది. ఫాదరీని మాటలమధ్యలోనే ఆపి ఏదో చెప్పబోయాడు. ఫాదరీ అతన్ని నివారించి, "ఆగు. ముందు నన్ను చెప్పనీ. ఈ మూడో వ్యక్తి పేరు ఫెర్నాండో. ప్రియురాలిపేరు మర్సిదా."

"తరవాత?"

"ముందు నాకు ఒక గ్లాసు మంచి నీళ్లివ్వండి."

ఫాదరీ రెండు గుక్కల్లు తాగి గ్లాసు మేజామీద పెట్టి అన్నాడు: "ఆ! ఇప్పు డెక్కడున్నాం మనం? అవును. ఆ తరవాత డాంటే ఇలా చెప్పాడు నాతో 'మీరు మార్సేల్స్ వెళ్ళాలి. వెళ్ళి ఈ వజ్రాన్ని అమ్మి అయిదు సమాన వాటాలుగా విభజించి ఈ అయిదుగురికీ ఇవ్వండి. వీరే ఈ ప్రపంచంలో నన్ను ఆదరించేవారు.' "

"అదేమిటి? అయిదు వాటాలా? మరి మీరు నాలుగు పేర్లే చెప్పారే?"

"నేను విన్నదాన్నిబట్టి అయిదోవ్యక్తి మరణించాడు. ఆయన డాంటె తండ్రి."

"అవును. పాపం అవును" అన్నాడు కొడరూస్. అతని మనస్సు కలవరపడింది. "పాపం చచ్చిపోయాడు."

"నాకీ వార్త మార్సేల్స్‌లో తెలిసింది" అన్నాడు ఫాదరీ, నిర్లక్ష్యభావం నటిస్తూ. "కాని ఆయన చనిపోయి చాలకాల

మైపోయినందువల్ల వివరాలేవీ నాకు తెలియలేదు. ఆయ నెలా చనిపోయారో మీ రేమైనా తెలపగలరా ?"

"అవును. నాకంటె ఎక్కువ అది మరెవరికి తెలుసును ? నేను అదే ఇంట్లో వృద్ధునితో కలిసిఉన్నాను. పాపం కొడుకు కనిపించకుండా మాయమైపోయిన ఏడాదిలో వృద్ధుడు ప్రాణాలు విడిచాడు. డాక్టర్లు ఏదో కారణం చెప్పారు. ఆయన్ని తెలిసినవారు దుఃఖంవల్ల గుండె బద్దలై చనిపోయాడన్నారు. కాని కళ్లారా చూసినందువల్ల నాకు నిజం తెలుసును. వృద్ధుడు ఆకలితో అలమటించి చనిపోయాడు.

"ఆ ! ఆకలి వల్లనా ?" అన్నాడు ఫాదరీ బిగ్గరగా. కుర్చీలో కూర్చోలేక లేచిపోయాడు. "ఆకలివల్లనా ? క్రూరజంతువులు కూడా ఆకలివల్ల చచ్చిపోవే ! వీధుల్లో తిరిగే కుక్కలికి కూడా ఎవరైనా చెయ్యి విదుపుతారుకదా ! ఇంక మనిషై పుట్టినవాడికి, క్రైస్తవమతస్థునికి, క్రైస్తవులని చెప్పుకునే పదిమందిమధ్యనూ ఉండగా, అన్నం దొరకలేదా ? ఒట్టిది ! అసంభవం !"

"నేను చెప్పవలసింది చెప్పాను." అన్నాడు కొడరూస్.

"చెప్పి, విరగడైపో" అని మెట్లమీదనుంచి దూషణ వినవచ్చింది. "ఈ గొడవలన్నీ నీ కెందుకు ? నీ తలెందుకు దూర్చుతావ్ ?"

ఇద్దరూ మెట్లవైపు చూశారు. రాడెల్ పాలిపోయిన ముఖం కనపడింది. ఇద్దరి సంభాషణా వినడంకోసం ఆమె అక్కడికి వచ్చి పైమెట్టుమీద కూర్చుంది.

"నీ కెందుకు మధ్య ?" అని అరిచాడు కొడరూస్. "ఈ పెద్దమనిషి సమాచారం అడుగుతున్నారు. మర్యాదకోసమైనా చెప్పవద్దా ?"

"అవును. కాని తెలివి ఉంటే చెప్పననాలి. నీచేత ఇదంతా చెప్పించడానికి ఆయనకే మవసరమో నీకేం తెలుసు ?"

"మంచి అవసరమే. మీ భర్త భయపడలసిన పనిలేదు." అన్నాడు ఫాదరీ. "నావల్ల మీ కెలాంటి అపకారం రాదు. దానికి నాది పూచీ."

రాడెల్ అస్పష్టంగా గొణిగి ఊరుకుంది. అరచేతుల్లో గడ్డం ఆనించి శ్రద్ధగా వింటూ అక్కడే కూర్చుంది. ఫాదరీ మంచినీళ్లు తాగి అన్నాడు "ఇటువంటి ఘోరమరణానికి గురికావడానికి వృద్ధుణ్ని లోకంలో అందరూ విడిచిపెట్టేశారా ?"

"లేదండి. లేదు." అన్నాడు కొడరూస్. "వృద్ధుణ్ణి మర్సిదా, మొరెల్ మాత్రం విడిచిపెట్టలేదు. కాని డాంటే ప్రాణమిత్రుడని చెప్పుతున్న ఫెర్నాండో అంటే, వృద్ధుడు ముఖం చూసేవాడు కాదు."

"అయితే అతను మిత్రుడు కాడా ?"

"గాస్పర్డ్" అని బిగ్గరగా అరిచింది రాడెల్. "నువ్వేం చెప్తున్నావో తెలుసుకో. జాగ్రత్త !"

"తన ప్రియురాలిని కాంక్షించే ప్రతికక్షి మిత్రు డెలా కాగలడు ! డాంటే హృదయం బంగారం కాబట్టి అందరూ మిత్రులే అనుకునేవాడు. పాపం ! పోనీలెండి. అది అతనికి తెలియకపోవడం మంచిదే. తెలిస్తే చనిపోయే సమయంలోనైనా క్షమించడం అసాధ్యమయ్యేది. లోకం ఏమనుకుంటే నాకేం. బ్రతికున్నవాళ్ల ద్వేషంకంటె చచ్చిపోయినవాళ్ళ శాపం అంటే నా కెక్కువ భయం."

"చెపటదద్దమ్మ !" అంది రాడెల్.

"అయితే డాంటేకి ఫెర్నాండో చేసిన అపచార మేమిటో మీకు తెలుసునా ?" అని ప్రశ్నించాడు ఫాదరీ.

రాడెల్ ఈమారు మరింత బిగ్గరగా అరిచింది. "గాస్పర్డ్ నీ ఇష్టం వచ్చినట్లు నువ్వు చేసుకోవచ్చు. నిన్ను ఎవరూ అదుపులో పెట్టరు. కాని నా సలహా వింటే చెప్తున్నాను, నువ్వేమీ చెప్పకు."

"ఈమాటు నువ్వు చెప్పిందే నిజం రాడెల్" అన్నాడు కొడరూస్.

"అయితే నాకు సమాచారం చెప్పరా?" అన్నాడు ఫాదరీ.

"ఏమిటి ప్రయోజనం ?" అన్నాడు కొడరూస్. "పాపం డాంటే బ్రతికిఉండి, మళ్లీ ఒకసారి మాలోకి వస్తే, అప్పుడు అతను మిత్రు లెవరో విరోధు లెవరో తెలుసుకోవాలనుకుంటే, ఆ పరిస్థితి వేరు. ఇప్పుడు అతనీ లోకంలో లేడు. అతని కింక పగతో నిమిత్తంలేదు. అదంతా మరిచిపోతే మేలు."

"అయితే విశ్వాసపాత్రులైనవారికే చెందవలసిన ఈ ప్రతిఫలాన్ని, మైత్రికి తగని మోసకారులని మీరు చెప్తున్న ఈ వ్యక్తులికి ఇవ్వమంటారా ?"

"మీరు చెప్పినదీ నిజమే. అయినా డాంటే ఇచ్చే ఈ బహుమతులు వారి కేపాటి ? మహాసముద్రంలో ఒక నీటిచుక్క !"

"వాళ్లు నిన్ను క్షణంలో అణిచెయ్యగలరుకూడా" అం.. రాడెల్.

"అంటే ఈ వ్యక్తులు భాగ్యం, అధికారం సంపాదించారా?"

కొడరూస్ క్షణంసేపు ఆలోచించాడు.

"మీకు ఇష్టంలేకపోతే చెప్పనవసరంలేదు" అన్నాడు ఫాదరీ, అత్యంత నిర్లక్ష్యంతో. "మీకు ఆక్షేపణ ఉంటే నేను మన్నిస్తాను. ఇంక ఈ విషయమై మనం మాట్లాడనవసరంలేదు. నేను నిర్వర్తించవలసింది కేవలం ఒక్క లాంఛనం మాత్రమే. ఇప్పుడు నేను వజ్రాన్ని అమ్మాలి."

ఫాదరీ మళ్లీ జేబులోనించి తోలుపెట్టె తీసి, అందులోనించి వజ్రాన్ని తీసి పట్టుకుని చూశాడు.

"ఇదిగో, ఇది చూడు. ఇలా రా" అని కొడరూస్ భార్యని పిలిచాడు. అతని గొంతుక బొంగురుపోయింది.

"ఏమిటది, వజ్రమా ?" అంది రాడెల్ ముందుకు ... చూస్తూ. మెల్లిగా మెట్లు దిగి సావడిలోకి వచ్చింది. "ఇదెన్ని... ఎవ రిది ?"

"నువ్వు వినలేదా ?" అన్నాడు కొడరూస్. "దీన్ని పాపం ఎడ్మండ్ నాకు, తన తండ్రికీ, డాంగ్లర్, ఫెర్నాండో, మర్సిదాలకీ ఇచ్చిపోయాడు. దీని ఖరీదు ఏభైవేలుంటుందిట. అందులో అయిదోవంతు మాకు వస్తుంది కాదండీ ?"

"అవును" అన్నాడు ఫాదరీ. "ఇదికాక డాంటే తండ్రి భాగంలోవంతుకూడా వస్తుంది. ఆ భాగాన్ని మీ నలుగురికీ పంచాలనుకుంటాను."

"మా నలుగురికీ పంచడం ఎందుకు ?"

"మీరు నలుగురూ ఎడ్మండ్‌కి మిత్రులు కాబట్టి."

"ద్రోహం చేసినవాళ్లు మిత్రులు కారు" అంది రాడెల్ సన్నగా.

"అవును" అన్నాడు కొడరూస్. "నేనూ అదే చెప్తున్నాను. ఇది ఘోరపాపం. అంతటి ద్రోహానికి ఇలా ప్రతిఫలమివ్వడం అన్యాయం."

ఫాదరీ వజ్రాన్ని జేబులో పెట్టుకుంటూ, "అలాగే జరుగుతుంది. ఇప్పుడు ఈ మిత్రుల చిరునామాలు నాకివ్వండి. డాంటే తుది కోరిక చెల్లిస్తాను."

కొడరూస్ చెమటలు కక్కుతున్నాడు. ఫాదరీ గుర్రం దగ్గరకు వెళ్లి గుర్రాన్ని చూసివచ్చాడు. ఈలోగా భార్యాభర్తలు ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

"ఆ వజ్రం అంతా మనదే అవుతుంది. ఫాదరీలు ఎప్పుడూ మోసం చెయ్యరు" అన్నాడు కొడరూస్ భార్య చెవిలో మెల్లిగా.

"నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి. నేనుమట్టుకు ఇందుల్లో తల దూర్చను" అంది రాడెల్. వొణికిపోతూ ఆమె మెట్లెక్కి వెళ్లిపోయింది. పైన మొదటిమెట్టుమీద నిలబడి "బాగా ఆలోచించుకో" అంది. దీర్ఘనిశ్వాసం విడిచి రాడెల్ తన గదిలోకి వెళ్లింది. మిద్దెమీద ఆమె అడుగులు స్పష్టంగా వినపడుతున్నాయి. పడకకుర్చీలో ఆమె కూలబడింది.

ఫాదరీ వచ్చి "ఏం నిశ్చయించుకున్నారు?" అన్నాడు.

"అంతా చెప్పేస్తాను" అన్నాడు కొడరూస్.

"అదే మంచిదని నేను గట్టిగా అనుకుంటున్నాను" అన్నాడు ఫాదరీ. "అంతే మీ కిష్టంలేనిది చెప్పాలని నేననడంలేదు. కాని డాంటీ కోరికప్రకారం అతని ధనాన్ని పంచడంలో మీరు నాకు సహాయపడ్డం మంచిదని నా ఉద్దేశం."

"ఒక్క క్షణం ఉండండి, మనకి అడ్డంకి ఏదీ రాకూడదు. అసలు మీ రిక్కడున్నట్లు ఎవరికీ తెలియడం మంచిదికాదు." అన్నాడు కొడరూస్. లేచి వెళ్లి సావిడి తలుపు మూసివేసి వచ్చాడు.

ఈలోగా ఫాదరీ లేచివెళ్లి మేజాపక్క ఒక మూల కుర్చీలో కూర్చున్నాడు. అక్కడ కొద్దిగా చీకటిగా ఉంది. అక్కడ నుంచి కొడరూస్ ముఖలక్షణాల్ని సూక్ష్మంగా గమనించడానికి వీలుంది. శ్రద్ధగా కథంతా వినడానికి ఫాదరీ కూర్చున్నాడు.



"ఒరే, అబ్బాయ్? పొద్దున గిన్నెలో రెండు అప్పచ్చులుండాలి. ఇప్పుడు ఒక్కటే ఉన్నదేంరా?"

"నాకు రెండోది ఉన్నట్టు తెలియలేదులే, అమ్మా."

* * * *

"డబ్బులేకపోయినా మా అమ్మాయిని పెళ్లాడేవాడివా?"

"ఓ, తప్పకుండా."

"చాల్లే, అంత బుద్ధిహీనుడైన అల్లుడు నాకవసరంలేదు."

* * * *

డాక్టరు: ఏమే, బాగ్ ఇలా తే. ఇతనెవడో నేను రాకపోతే చస్తానని టెలిఫోనులో చెబుతున్నాడు.

భార్య: మన అమ్మాయి స్నేహితుడు లెండి.

* * * *

"అశ్వదళంలో ఉన్నవాడివి విమానదళానికెందుకు మారావూ?"

"విమానం నన్ను పడదోసి, తొక్కి, కొరకదు. అందుకూ."

* * * *

దొంగ: డబ్బిస్తావా, చస్తావా?

పిసినిగొట్టు: చంపెయ్యి. నీకు డబ్బిచ్చి వృద్ధాప్యంలో ఏంకాను?

* * * *

"ప్రపంచంలో ఉన్న విషయాలన్నీ నాకూ మా అన్నయ్యకూ తెలుసు."

"అట్లాగా? అయితే ఆసియా ఎక్కడుందో చెప్పు."

"అది మా అన్నయ్యకు తెలిసిన విషయం."

* * * *

"తమ కీ ప్రాంతంలో ఎక్కడన్నా పోలీసుగాని కనిపించాడా?"

"లేదే?"

"అయితే తమ గడియారమూ, మనీపర్సూ దబ్బున ఇలా ఇచ్చెయ్యండి."

## అదీ-ఇదీ

### అసియా నూతన స్వరూపం :

పశ్చిమదేశాలనుండి విముక్తిపొంది, తన నవశక్తిలో పూర్తివిశ్వాసం కలిగి, 30 ఏళ్ల ఎడతెగని యుద్ధంలో రాటుతేలి, విప్లవయుత పరిపాలన ఏర్పడిన ఫలితంగా వచ్చిన ఉత్సాహశక్తులు గల ఈ బ్రహ్మాండమైన దేశాన్ని (చైనాను) చంగ్ కైషేక్ కు ఫార్మోజాలోగల బలాలతో తిరిగి గెలిచి సామ్రాజ్యవాదులపరం చెయ్య తలపెట్టడం కేవలం వెర్రి అని యూరప్ భావిస్తున్నది. చైనాలో సోషలిజం పురోభివృద్ధి చెందుతున్నదని అంగీకరిస్తున్నారు. దానిని నిగ్రహించే శక్తులేవీ లేవు. మూడు నిర్వివాద కారణాలవల్ల మావోసేటంగ్ స్థానం దుర్భేద్యంగా భావించబడుతున్నది. ఒకటి, చైనా అగ్రదేశం, దానిని మరేదేశమూ శాసించలేదు. రెండు, చైనా అగ్రదేశం అవుతూనే సోషలిజం అవలంబించి, విజయవంతమైన విప్లవంవల్ల జనించిన ఉత్సాహశక్తులతో ఆ సోషలిజమును అమలుచేస్తున్నది. మూడు, చైనాలో జరిగే ప్రతిదీ ఆసియాపరిణామాలకు అనుగుణంగా ఉన్నది. చంగ్ కింద ఉన్న మూడులక్షల సైనికులను పంపిగాని, అపఖ్యాతిపాలైన చైనా జాతీయ ప్రభుత్వానికి అంతులేని డబ్బిచ్చిగాని పెకింగ్ ప్రభుత్వాన్ని పడగొట్టాలనుకోవడం హాస్యాస్పదమని యూరపులోని రాజకీయ విజ్ఞులు భావిస్తున్నారు.

యూరప్ ఆసియాలమధ్య ఉండిన పాత సంబంధం...1929 లో తారుమారయిందని నా మతం...ఆ సంవత్సరమే సోవియట్ యూనియన్ మొట్టమొదట పంచవర్ష ప్రణాళిక అమలుచేసింది. (అప్పుడు నేను మాస్కోలో ఉండి, ఈనాడు ముఖ్యులైన చైనా రాజకీయవేత్తలను కొందరిని కలుసుకున్నాను.) అగ్రరాజ్యాల అధీనంలో ఉండి వారి ఎంగిలి మెతుకులతో జీవించే ప్రపంచ ప్రజలందరూ రష్యాను చూసి నీతి నేర్చుకున్నారు. తన శక్తులనూ, సాధనాలనూ కూడగట్టుకున్నట్లయితే వెనకపడిన దేశం ఏమి సాధించగలదో తెలుసుకున్నారు. అటువంటి దేశం విశ్వప్రయత్నం చేసినట్లయితే ఇతర దేశాల సహాయం లేకుండా జరుపుకోగలదని గ్రహించారు. అమెరికా వెలుపల ఉండేవారికి తమ జీవిత విధానం కావాలిగాని అమెరికాలోని జీవిత విధానం అవసరంలేదు—ఈ సంగతి ఈ దేశంలో (అమెరికాలో) తరుచు మరచిపోతూ ఉంటాం.

నూతన ఆసియా పరిణమిస్తున్నది. దీని శక్తులను చరిత్ర అంచనావేస్తుంది. ఈ పరిణామం అంతటా ఒకటిగా ఉండదు. జాతీయ, ఆర్థిక స్వాతంత్ర్యకాంక్ష ఆసియాలో కొన్నిప్రాంతాల వ్యక్తమయినంత శీఘ్రంగా మరికొన్ని ప్రాంతాల కాకపోవచ్చు. ఈ వ్యత్యాసంవల్ల పరిణామంలో మార్పుండదు. ఇండియా-చైనాకు భిన్నమైన రాజకీయవ్యవస్థగల ఇండియా క్లిష్టస్థితిలో ఉండి పశ్చిమదేశాలను గోధుమలు అడుగుతున్నమాత్రంచేత ఆసియా పరిణామం గురించి అపోహపడరాదు.

ఆసియాదేశాలవారు స్వాతంత్ర్యం కొరకు ప్లానింగు తలపెట్టినప్పుడు, అమెరికా అనుసరించే పోటీ ఉత్పత్తి విధానానికి వికటించింది... ఆసియాదేశంలో పోటీ విధానం అవలంబిస్తే అది దెబ్బతింటుందని బెల్ రిపోర్టు (ఫిలిప్పీనుల సందర్భంలో) నిరూపిస్తున్నదనీ, ఆసియాలో జరిగే పరిణామాన్ని గుర్తించినట్లయితే అమెరికాకు విషంలాటిదైన సోషలిస్టు ప్లానింగు పద్ధతి ఆసియాలో అనుమతించవచ్చునని కైబర్ మెండి (ఫ్రెంచి విలేఖరి) వ్రాశాడు. కాని, చైనా దురాక్రమణ జరిపిందని ఆరోపించడాన్ని బట్టీ, చంగ్ ప్రభుత్వాన్ని పునః ప్రతిష్ఠించాలని అమెరికాలోని పలుకుబడిగల రాజకీయవేత్తలు కొందరు వాదించడాన్ని బట్టీ ఇది జరిగే సూచనలు లేవని తెలుస్తుంది.

—"నేషన్"లో అల్వ్యారెడ్ వెల్ నామో.




# ఆమని

శ్రీ నందూరి రామమోహనరావు

ఆమని మళ్లీ వచ్చినది,
అందాలెన్నో తెచ్చినది.

మల్లెలు, జాజులు విచ్చినవి,
మధురవాసనలు తెచ్చినవి.

మామిడికొమ్మలు చిగిరించీ
మాధవిలతలు కుసుమించీ

కొమ్మలకోకిల కూసెనులే,
జుమ్మని తుమ్మెద మ్రోసెనులే.

పువ్వుల తేనెలు తొణికెనులే,
పుప్పొడిసుమాల పొంగెనులే.

పిల్లల్లారా! రారండీ!
ఉల్లాసముతో ఆడండీ!

ఋతువుల రాజా చైత్రునికీ
చైత్రుని రాణీ మాధవికీ

స్వాగతహారతు లెత్తండీ!
స్వాగతశంఖా లొత్తండీ!

భూమికి నేడే శుభోదయం,
భూలోకానికి మహోదయం.

# పాదుషా ఉంగరం

శ్రీ ఆర్. వెంకటదాసు

అక్బరు పాదుషా మన దేశాన్ని పరిపాలించే కాలంలో, అతని ఆస్థానంలో, బీర్‌బల్ అనే అతనుండేవాడు. బీర్‌బల్ అంతటి మేధావి, సహృదయస్ఫూర్తి, వుపాయశాలీ, అయినవాడు, అక్బరు ఆస్థానంలో లేడనే చెప్పాలి—

ఐతే-అక్బరు మహమ్మదీయ మతస్థుడు -బీర్‌బల్ హిందువుడు- మహమ్మదీయులకూ, హిందువులకూ ఆ కాలంలో బద్ధవైరంగా వుండేది. కాని - అక్బరు పాదుషా పాలనలో మాత్రం అలాంటివైరాలేమీ లెక్కలోకి రాలేదు-అందుచేతనే అక్బరు హిందువుడైన బీర్‌బల్‌ను తన ప్రాణప్రదంగా ప్రేమించే వాడు.

యిట్లా ఒక హిందువుణ్ణి చేరదీసి, ప్రేమిస్తూ వుంటే తక్కిన ముస్లిం మేధావులూ పండితులూ ఓర్వలేక పోయే వారు. ఐతే-వారిలో ఒక్కరూ చక్రవర్తి కెదురు చెప్పలేక పోయేవారు.

కాని-వాళ్ళ లోని ఈర్ష్యవాళ్ళ నూరుకోనిస్తుందా?...అందుచేత "అటో-యిటో" తేల్చుకో వాలనే వుద్దేశంతో, వారిలో ఒకడు పాదుషా, ఒంటరిగా వున్న సందు తమకోరె వెల్లడించాడు-అదేమంటే బీర్‌బల్ తెలివైనవాడో, వీరే తెలివైనవారో తెల్సుకోటానికి ఒక పరీక్ష పెట్టుమని పాదుషాని కోరినారు-

పాదుషా వీళ్ళ తెలివి తక్కువకు లోపల నవ్వుకుంటూ "మీ రెవరూ బీర్‌బల్ కాలి గోరుకైనా గీటురారు" అని చెప్పేయాలనుకున్నాడు. కాని-ఆసంగతి వాళ్ళంతట వాళ్ళే తెల్సుకోవటం మంచిదని, పరీక్ష చేయటానికే సమ్మతించాడు-

ఒకనాడు పాదుషా బీర్ బల్, తోనూ తనఆస్థానంలోని మేధావులతోను షికారుకు బయలుదేరాడు. పాదుషా వారందర్నీ ఒక నూతి దగ్గరకు తీసుకుపోయి, మాటాడుతూనే, చేతి ఉంగరాన్ని నూతిలో జార విడిచేశాడు.

ఐతే-అలాంటి ఉంగరాలు పాదుషా కొక లెఖ్ఖా? కాని వాళ్ళ మేధాసంపత్తి పరీక్షించు దామనే తలంపుతో వారితో యిలాగన్నాడు పాదుషా "మీలో ఎవరైనా సరే-ఈనూతిలోని వుంగరాన్ని నూతిలో దిగకండా, త్రాడూ, కర్రా వుపయోగించకుండా బైటికి తీయాలి. దీనికిగాను ఒక నెలరోజులు గడువిస్తున్నాను - చూదాం, మీ శక్తి సామర్థ్యాలు" అనేసి, అందరితో సహా కోటకు, వెళ్ళిపోయినాడు.

అప్పటి కిప్పుడే గడువులో వారంరోజులై పోయినై. మహమ్మదీయ మేధావులంతా కూర్చుని, "ఆ వుంగరమెలా తీయటమా" అని ఆలోచించ సాగారు. కాని-వాళ్ళ బుర్రలకే మీ తట్టలే!

బీర్‌బల్ కూడా ఆలోచించాడు బీర్‌బల్ కొకఅనుమానం తట్టింది- పాదుషా యింత చిన్నపని చేయటానికి సరిగా నెలరోజులు గడు వెందుకిచ్చాడా? అని-ఆలోచించగా అతనికి, నెల రోజుల్లో వర్షకాలం వస్తుంది-కాబట్టి ఈ పని సాధించటానికీ, వర్షానికి ఏదో సంబంధముందని తెల్సుకున్నాడు. వెంటనే అతనికి మెరుపు వంటి ఆలోచన తట్టింది (అన్నట్లు చెప్పటం మరచాను. ఎండాకాలం అవటం వల్ల ఆనూతిలో నీళ్ళు లేవు)

బీర్ బల్ కొంత గోమయం (పేడ) తెప్పించి, ఈ వుంగరంపైనే పడేటట్లు ఆనూతిలో వేయించాడు. అది, ఎండలకు ఎండిపిడక అయింది. దానిలో వుంగరం చిక్కు కుంది-

తర్వాత, వర్షకాలం ప్రవేశించింది-దబదబా నాలుగు వర్షాలు పడేసరికల్లా, నూతులన్నీ జలమయమై పోయినై. ఇలా, నూతులన్నీ నీరుతో నిండి పోగానే. వుంగరంవున్న పిడక నీటి మీద తేలి పైకివచ్చింది-

ఇంతలో గడువు పూర్తికాగానే, బీర్ బల్, అక్బర్ పాదుషానూ, తక్కిన మహమ్మదీయుల్నీ; ఆనూతి వద్దకు తీసుకునివెళ్ళి, వుంగరం తీసియిచ్చి, తను ఏం చేసిందీ

చాలా సంవత్సరాల క్రితం ఒక ఊళ్లో వీరన్న అనే కట్టెలు కొట్టుకునే వాడుండేవాడు. వాడికో పెళ్లాం, ముగ్గురు కూతుళ్లుండేవారు. వాళ్ళందరూ రోజూ ఆ వూరికి దగ్గరనేవున్న ఒక అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి అమ్మి జీవిస్తూండేవాళ్లు. కాని కొద్దికాలమైన తరువాత ఒక్క వీరన్న మాత్రమే కట్టెల కొరకు అడవికి వెళ్ళడం ప్రారంభించాడు. ఆ అడవిలో దారులన్నీ తికమకగా ఉంటవి. అందుకని అప్పుడప్పుడు, ఎప్పుడూ ఆ అడవిలో తిరిగే వారికే తాము వచ్చిన దారిని కనుక్కోవడం కష్టంగా ఉండేది. అదీగాక ఆ అడవినిండా క్రూర జంతువులే. అందరూ ఆ అడవిలోనికి వెళ్ళటానికే చాలా భయపడేవారు.

కాని వీరన్నకి, వీరన్న పెళ్లానికి చాలా కాలమునుండి అదే వృత్తి కాబట్టి వారిద్దరకూ ఆ అడవి దారులన్నీ బాగా తెలుసు. రోజూ వీరన్న కోడి కూయగానే లేచి కూడు తిని కట్టెలు కొట్టటం కోసం అడవికి వెళ్లేవాడు. వీరన్న పెళ్ళాం ప్రొద్దున్నే లేచి పనులన్నీ చేసుకుని, వంటవండి, పిల్లలకు పెట్టి, తనుతిని, వీరన్నకు మధ్యాహ్నపు అన్నం తీసుకొని వెళ్లేది.

ఇలా వుంటూండగా ఒక రోజున




వీరన్న పెళ్లానికి జ్వరం వచ్చింది. వీరన్నకి అన్నంతీసుకెళ్లే వాళ్లెవరూ లేరు. అతని ముగ్గురు కూతుళ్ళలో ఒకరికి గూడా దారి తెలియదు. ఆ రోజు కట్టెలకు వెళ్ళకపోతే మర్నా

శ్రీ పినపాక నరసింహమూర్తి

డందరూ పస్తే. అందుకని వీరన్న పెద్ద కూతురు లచ్చితో యిలాగన్నాడు.

"నేను వెళ్లే దారిపొడుగూనా ధాన్యపు గింజలు చల్లుతూ వెడతాను. వాటి గుర్తువెంబడే బువ్వ తీసుకొచ్చావంటే నేనున్న చోటుకు

---

వారలకు చెప్పాడు-అక్బరు బీర్బల్ నెంతో పొగిడాడు - మన మహమ్మదీయ మేధావులంతా సిగ్గుతో తలలు వంచుకున్నారని వేరే వ్రాయాలా ? ★

రాగలవు. తిరిగి ఆ ధాన్యం గుర్తుతోనే యింటికిగూడా రావచ్చు."

వీరన్న కోడి కూయగానే లేచి అడవికి వెళ్ళిపోయాడు. పెద్ద కూతురు లచ్చి మధ్యాహ్నమయ్యేటప్పటికల్లా తండ్రికి బువ్వ తీసుకొని తండ్రి చల్లుతూ పోయిన ధాన్యం గుర్తు పెట్టుకొని ఆ దారివెంబడే పోసాగింది. కొంత సేపటికల్లా అడవి మధ్యకు చేరుకుంది. తరువాత ఎటు పోవాలో తెలియలేదు. ఎందుచేతంటే వీరన్న గుర్తుకోసరం చల్లిన ధాన్యంగింజలను కాస్తా పక్షులు ఏరుకొని తినేశాయి. అందుకని దారి తెలియక తప్పు దారినిబడి చాలా దూరము నడిచిపోయింది. ప్రొద్దుగ్రుంకి నాల్గు వైపులా చీకట్లు కమ్మాయి.

ఇంక ఎటుపోవాలో దారి తెలియక నిలబడిపోయింది అట్లానిలబడి అటూ యిటూ చూస్తూండగా దూరాన వెలుతురగుపడింది. ఆ వెలుతురు వచ్చిన వేపే నడిచి వెళ్లగా ఒక చిన్న యిల్లు కనబడింది. లచ్చి తలుపు తట్టింది.

వెంటనే తలుపులు వాటంతటవే తెరుచుకున్నాయి. లచ్చి లోపల కడుగు బెట్టగానే బారెడు గడ్డం. మూరెడు మీసంవున్న ఒకముసలి వాడగుపడ్డాడు. లచ్చి అతనితో;

"నాకు యీ రాత్రి వుండటానికి కొంచెం జాగా యిస్తారా! నేను దారితప్పి తిరుగుతున్నాను" అని అంది.

వెంటనే ఆ ముసలివాడు తల ఎత్తి చూచి "అదిగో! ఆ పక్క గదిలోవున్న కోడిపెట్టని, కోడిపుంజుని, ఆవుని అడుగు! అవి ఇష్టపడ్డాయంటే నాకేమీ అభ్యంతరం లే"దన్నాడు. అప్పుడు లచ్చి వాటి నడిగింది తన్నా రాత్రి కక్కడుండనీయుమని. అవి ఒప్పుకున్నాయి. వెంటనే ముసలివాడు లచ్చితో "లోపలికి వెళ్ళి అన్నంవండి వుంచు నేను వచ్చి తిన్న తరువాత నువ్వు గూడా తిందువుగాని" అని అన్నాడు.

అప్పుడు లచ్చి లోపలికి వెళ్లి అన్నంవండి ముసలివాడు రాగానే వాడికి కొంత పెట్టింది. ఆ తరువాత మిగిలిన అన్నం అంతా తినేసేసింది తను ఒక్కర్తే. ఇంతకీ తన కాశ్రయమిచ్చిన ఆ మూడు జంతువుల సంగతే మర్చిపోయింది. పాపమా మూడు జంతువుల కారాత్రి పస్తే.

తరువాత లచ్చి ముసలివాడిని "నాకు నిద్దరొస్తూంది! ఎక్కడ పడుకోమంటావు?" అనిఅడిగింది. దానికి వాడా సంగతి కూడా ఆ మూడుజంతువులనే అడగమన్నాడు. లచ్చి వాటి నడగగానే. అవి విసుక్కుంటూ "దక్షిణపు గదిలో పడుకోఫో!" అని అన్నాయి. లచ్చి వెళ్లి ఆగదిలో మంచం మీద పడుకున్నది.

ఆ గదిలో వున్న ఆమంచం మాయమంచం. దానిమీద ఎవరైనా పడుకున్నారంటే, అది అర్ధరాత్రయేటప్పటికి దానంతటది భూగృహంలోకి దిగిపోతుంది. దాని మీద పడుకున్న లచ్చికి సరిగా యిదేగతి కలిగింది. లచ్చి కాస్తా ఆ భూగృహంలో చిక్కుపడిపోయింది. ఆమాయమంచం లచ్చిని భూగృహంలో వదిలి యథాప్రకారంగా పైకి వచ్చేసింది.

పాపం అక్కడ వీరన్న కాపూట తిండిలేక పోయింది. సాయంకాలానికియిల్లు చేరుకున్నాడు.

"ఇవాళనాకు మధ్యాహ్నం లచ్చితో బువ్వ పంపలేదెందుకు?" అన్నాడు.

"లచ్చి తీసుకొచ్చిందే? అయ్యో ఖర్మ! దారి తెలియలేదేమో" అని జవాబిచ్చింది పెళ్లాం.

"కాని, దారి తెలుసుకొని రాగలదులేఅది! దారిలో రేపునాకు కనపడకపోతుందా!" అనిఅన్నాడు.

ఆమర్నాడు అడవికి పోతూ రెండో కూతురుతో "రామీ! ఈ వేళనువ్వొత్తుకరావే బువ్వ! నిన్నకన్న బాగా దారికనపడేట్లు చల్లుతాలే గింజలు" అన్నాడు.

కాని, రామికిగూడా లచ్చికి సంభవించిన పరిస్థితేసంభవించింది. ధాన్యం పక్షులేరుకొని తినేశాయి. దారితప్పిపోయిపోయి ఆముసలివాడి యిల్లుచేరింది. తన అక్క లచ్చిలాగానే అన్నంవండి తనుతిని ముసలివాడికి పెట్టిందే గాని, ఆ మూగ జంతువులకేమీ పెట్టలేదు. చివరకు దక్షిణపు గదిలోనే పడుకొని అర్థరాత్రయేటప్పటికి భూగృహంలో పడిపోయింది.

ఆనాడు కూడా వీరన్నకి తిండి లేదు. ఏలాగో యింటికి కాళ్ళీడ్చుకుంటూ వచ్చాడు. ఇంటికి రాగానే లచ్చిలాగే రామికూడా దారి తప్పి యింత వరకూ వాళ్లిద్దరూ రాలేదని గ్రహించాడు. ఆరాత్రికి తానేవండి భార్యకు, కూతురుకు పెట్టితాను కూడా తిని పడుకున్నాడు.

మర్నాడుదయాన్నే లేచి "సీతీ!

నేను అక్కయ్యలని వెదకటానికి వెళుతున్నా! నేను అడవిలో వున్న ఒకపెద్దమఱ్ఱిచెట్టుదాకా ఒక్కో ధాన్యంగింజే చల్లుకుంటూ వెళతాను! నువ్వు మధ్యాహ్నం బువ్వ తీసుకొని అక్కడికి వచ్చినావంటే నేను అడివంతా తిరిగి నిన్ను అక్కడ కలుసుకొంటాను" అని చెప్పి వెళ్ళాడతను.

అప్పుడు సీతి తల్లికింత జావా కాచిపోసి, తండ్రికి అన్నంతీసుకుని బయలుదేరింది. కాలం విపరీతమైనపుడెవరేమి చేసినా ప్రయోజనం లేదు! సీతి కూడా దారితప్పి ముసలివాడింటికి చేరుకుంది. కాని అక్కడ తన అక్కలవలెగాక అన్నం వండగానే ఆమూడు జంతువులకు ముసలివాడికి ముందు పెట్టి తరువాత తను తిన్నది.

తరువాత వాటిని తన్నెక్కడ పండుకోమంటారని అడిగింది. అవి సంతోషంతో ఉత్తరపు గది చూపించి అందులో పడుకోమన్నాయి. అర్థరాత్రయేటప్పటికి ఓ చక్కని కలవచ్చింది.

ఆ కలేమిటంటే, అక్కడున్న గోడలన్నీ బంగారుగోడలయ్యాయి. సీతి పడుకున్న మంచం హంసతూలికాతల్పమయినట్లు, ముసలాడు చక్కని రాజకుమారుడైనట్లు, అక్కడున్న మూడుజంతువులు ముగ్గురు సేవకులుగ మారినట్లు, ఆఇల్లు పెద్ద రాజభవన మయినట్లు, ఆ చుట్టుపక్కలనున్న అడివంతా పెద్ద రాజ్యమయినట్లు, అందులో వున్న వాళ్ళన్నీ సైన్యమయినట్లు ఇంకా ఎన్నోవింతలలోకూడివచ్చిందాకల.

వెంటనే కళ్ళుతెరచి చూచింది. కలలో కనుపడినవన్నీ మళ్ళీ యిక్కడ ప్రత్యక్షమయాయి. మొదట చాలా ఆశ్చర్యపడింది. తరువాత అవి అన్నీ నిజంగా మారిపోయిన వేనని గ్రహించింది. రాజకుమారుడుగా మారిపోయిన ఆ ముసలివాడు సీతతో యిలాగన్నాడు.

"కొన్ని వందల ఏండ్ల క్రిందట నేనీ రాజ్యాన్ని పరిపాలిస్తూండే వాణ్ణి. ఒక రోజు మా రాజ్యానికి ఒక మహాముని వచ్చాడు. ఆయనకు పరిచర్య చేయడంలో ఏదో కొంత అపరాధంజరిగింది. దాని కాతడు మమ్ముల నీవిధంగా శపించాడు. మూడు జంతువులుగ మారిపోయిన నాయీముగ్గురి సేవకులు ఎవరికైనా మేలుచేస్తే వారాజంతువులు తమ చేసిన మేలుమరచిపోక తిరిగి విశ్వాసం కనబరచుటయే శాపావసానమని శలవిచ్చాడాముని. ఆయన శలవిచ్చినట్లే నీవా జంతువుల యెడ కృతజ్ఞత కనపరుపగానే మేము మా యథాస్థితికి తిరిగి మారిపోగలిగాము. దీనికిగాను నిన్ను నాపట్టపురాణిగా చేసుకుంటాను. నీకుముందు యిదరు ఇక్కడికి వచ్చి ఆజంతువుల యెడ విశ్వాసం చూపనందువల్ల వారిరువురు కారాగృహంలో మగ్గుతున్నారు. చూద్దువుగాని రా!" అని సీతను తీసుకెళ్ళి వాళ్ళిద్దరినీ చూపించాడు.

వాళ్ళిద్దరిని చూడగానే వాళ్ళిద్దరు తన అక్కలుగా గుర్తించింది సీత. రాజకుమారుడు వాళ్ళిద్దరకూ తగిన శాస్తి అయిందిలే అంటూంటే పాపం వాళ్ళమీద జాలికొద్ది విడిపించింది సీత. తరువాత తన తల్లి తండ్రులను కూడా తీసుకొచ్చివాళ్ళతోటి భర్తతోటిహాయిగా, సుఖంగా, రాజ్యంచేస్తూన్నది సీత. చేసిన మేలుమరువకుండావుంటే అందరూ సీతలాగే సుఖిస్తారు. ★

# దివ్యస్మృతి

(1-వ పేజీ తరువాయి)

తను ప్రదర్శించి, ఆంధ్రులకు మహానాయకులనిపించుకొన్న ప్రముఖులు కూడ, కాలక్రమానుగతమున ఇట్టి నగ్న రాజకీయ తంత్రములలో, అధికారకామములో మునిగిపోవుట శోచనీయము.

శ్రీనాగేశ్వరరావు పంతులుగారే నేడుండినచో, ఆంధ్రులలో ఇంత అవ్యవస్థ సంభవించియుండెడిది కాదేమో, గురుపాదులైనవారి ఆదేశములు సర్వదాశిరోధార్యములై ఆంధ్రరాజకీయములు తిన్ననిదారి త్రొక్కెడివేమో, యని ఆశించుట అత్యాశకాదు. పంతులుగారి సంకల్పశక్తి, ఆచరణబలము ఎరిగినవారందరు ఇది గుర్తింతురు.

శ్రీ నాగేశ్వరరావుగారు ఆంధ్రులకు బహుముఖములైన సేవ చేసిరి. రాజకీయముగనే గాక భాషారంగమునగూడ ఆయన యొనర్చిన కృషి అపారమైనది. ప్రప్రథమ దైనిక వార్తాపత్రికను స్థాపించుటయే గాక, అమూల్యమైన వాఙ్మయ పరిశోధన గ్రంథములను, తత్వజిజ్ఞాసువుల కతిప్రీతిపాత్రమైన భగవద్గీతా వ్యాఖ్యానమును తెలుగువారికొసగిరి.

పంతులుగారు చూపిన ఆదర్శపథమును విడనాడక ఒకతాటిపై, ఒకమాటపై పురోగమించెదమని పునఃకంకణధారులగుట ఈనాడు ఆంధ్రులందరికిని పవిత్రవిధి. ★



# పట్టుదల

శ్రీ మోపర్తి రామచంద్రరావు

దశరథుని తాతగారగు రఘు మహారాజు భూమిని పాలిస్తున్న కాలంలో వరతంతు వనే మహర్షి ఉండేవాడు. అతడు సమస్త విద్యలు తెలిసినవాడు. గొప్ప పండితుడు కూడ. అతని ఆశ్రమం శాంతికి, సత్యానికి నిలయమై వర్ధిల్లుతుండేది.

ఇట్లా ఉండగా ఒకనాడు పదియేండ్ల బాలుడొకడు వచ్చి "మహాత్మా! నన్ను కౌత్సుడంటారు. మీవద్ద విద్య నేర్చుకుందామని బహుదూరాన్నుంచి ఎంతో ఆశతో వచ్చాను" అన్నాడు వరతంతునితో.

అప్పుడు ముని సరేయని కౌత్సునికి తనకు తెలిసిన పదునాలుగు విద్యలను ఎంతో శ్రద్ధగా చెప్పాడు. కౌత్సుడు మిగుల మంచివాడు. గురువు ఎడల ఎంతో భక్తికలిగి, గురువు చెప్పిన పనులన్నిటినీ తరువాత చేస్తాననక ఎప్పటికప్పుడు చేసి ఎంతో శ్రద్ధతో విద్యల నన్నింటిని నేర్చుకున్నాడు.

ఇట్లా వుండగా ముని "నాయనా! నీ మంచి బుద్ధులు నాకు ఎంతో సంతోషాన్ని కలిగిస్తున్నై. ఎంతో చక్కగా విద్యల నన్నింటినీ నేర్చుకున్నావు. నిన్ను ఎప్పుడు చూస్తామా అని నీ తల్లిదండ్రులు ఎదురు చూస్తున్నారు. ఇకనీవు వెళ్ళి పెళ్ళిచేసికొని వారిని సంతోషపెట్టు. నీకు సకల శుభములు కలుగుతై" అని కౌత్సుని ఆశీర్వదించాడు.

అప్పుడు కౌత్సు డన్నాడుగదా "మహాత్మా! నేను కూడ నా తల్లిదండ్రులను చూడ్డానికి ఎంతో తొందరపడుతున్నాను. కాని నా కొక కోరిక వుంది. మీరు కోరినదానిని గురుదక్షిణగా యిచ్చి వెళ్తాను."

ముని అన్నాడుగదా "నాయనా! నీవు నాకు చేసిన సేవలే గురుదక్షిణ. అంతకన్న గురుదక్షిణ యింకా యేముంది. డబ్బును తెచ్చి యిస్తానంటావేమో. ఆకులు దుంపలు తిని జీవించే మాకు డబ్బెందుకు. కాబట్టి యిక మీయింటికి వెళ్ళి పెళ్ళిచేసికొని సుఖంగా వుండు."

ఇంత చెప్పినా కౌత్సుడు వింటాడా? వినక అన్నాడుగదా "మహాత్మా! శిష్యుడు తన సంతోషము కొద్ది గురుదక్షిణయిస్తే తప్పేముంది. ఇదివరకు ఎంతో మంది శిష్యులు గురువులకు గురుదక్షిణలు యివ్వలేదా. కాబట్టి నాయెడ దయగలిగి గురుదక్షిణ కోరండి."

ఆమాటలు వినేటప్పటికి ఎక్కడ లేని కోపంవచ్చి "నేనెంతో మర్యాదగా చిలుకకు చెప్పినట్లు చెప్పాను. ఎంతచెప్పినా నీవు మాత్రం నా మాట వినక నావిద్యలకు వెలకట్టున్నావు. నీవొక మూర్ఖుడవతున్నావు" అని కౌత్సుని కోప్పడ్డాడు.

ఇంత చెప్పినా కౌత్సుడు అప్పటికీ వినకపోవడంతో ముని విసి

(47-వ పేజీ చూడండి)

# బొమ్మలాట



[బృందగానం]

పదండిరా !...పదండిరా !
పరుగుపరుగునా పోదామూ
ఆటలనాడీ - పాటలబాడీ
అలసీ సొలసీ కూర్చొనీ
తీయతీయనీ కమ్మకమ్మనీ
తెన్గువీరుల పౌరుష చరితం
కథలుగ చెప్పుకు విందామూ
కలసీమెలసీ పోదామూ !
పదండిరా !...పదండిరా !
పరుగుపరుగునా పోదమూ!

[కొంత నిశబ్దం]

విశ్వం—

ఏమోయ్ సత్యం
ఏమిటి చూస్తావ్ ?
ఏమైనా కథచెప్తావా ? ఆ
ఏమైనా ఆడ్దామా ?

సత్యం

చెప్తానోయ్. చెప్తానూ
చెడినరాజు కథ చెప్తానూ
అందరు వచ్చి కూర్చోండీ
సంబరంగా చెప్తానూ

అంతా

ఆ ... ఆ ... ఆ ... చెప్పింకా
అందర మొచ్చామూ.

సత్యం

అనగనగా ఒకరాజూ
అతనికి ఒక్కడె కొడుకోయ్.
అతనిపేరు తెలుసా మీకూ
అతనే ప్రహ్లాదూ.

శాంత

తెలుసోయ్ సత్యం తెలుసోయ్
తాతయ్య చెప్తే విన్నానూ.

సత్యం

అయితే ఇక నే చెప్పన్లే
అందరు లేచీ పొండింకా

విశ్వం

అబ్బబ్బా! ఏమిటి శాంతా
అతణ్ణి చెప్పనీయవేమీ ?
నీ కొకరికు తెలిస్తె చాలా
మాకందరికీ వద్దంటావా?

శాంత

వద్దన్నానా బావా నేనూ
ఊరికే తెలుసన్నానూ
ఇంతదానికే మూతిముడుచుకు
ఎందుకు సత్యం ఉండాలి?

శ్రీ వెంగరాజు లింగమూర్తి

జానకి

అయితే సత్యం చెప్పరాదటోయ్
అదంటె లెక్కేమిటి మనకూ

సత్యం

చెప్తాన్ జానకి చెప్తానూ
చిలిపిదానితో ఏమిటిలే
ఒక్కజట్టుగా మనిద్దరం
అక్కడకెళ్ళి కూర్చుందాం.

శాంత

చిలిపిదాన్ని నేనైతే
చిలిపివాడవే నీవూనూ
మీరిద్దరు ఒక జట్టైతే
మేమొక జట్టవుతాం.

విశ్వం

తగవెందుకు మనకందరికీ
తెలిస్తే అంతా నవ్వుతారూ
కథను మాని ఇంకేమైనా
కలుపుగోరుగా ఆడ్దామూ!

జానకి

సరే సరే అలాగే చేద్దాం,
సత్యం రావోయ్ ఆడ్దామూ!

సత్యం

వాళ్ళతో కలసి మనమెందుకులే
వాళ్ళక్కడనే మన మిక్కడనే
వేరువేరుగా ఆడ్దామూ
పొరపులు లేకుండు-బాయీ!

[కొంతనిశ్శబ్దం]

శాంత

ఏమోయ్ బావా,
ఏమిటి చూస్తావ్?
బొమ్మరింటినీ కడ్దామా?
బొమ్మలపెళ్లీ చేద్దామా?

విశ్వం

ఇదిగదిగో కడతున్నా
ఇది మన ఇద్దరి ఇల్లనుకో
నీవూ నేనూ ఏమౌతామో
నీకేమైనా తెలుసా?

శాంత

అమ్మా నాన్నా ఏమౌతారో
అంతేనూ మనమిద్దరమూ

విశ్వం

ఇదుగో... ఇదే మనిల్లూ
ఇదె మన సంసారం.

[కొంతనిశ్శబ్దం]

సత్యం

ఏమే జానకి ఏంజేస్తున్నావ్
ఇల్లు కడిగి ముగ్గులు వేశావా?

జానకి

వేశానండోయ్ వేశానూ ఈ
గిన్నెలు కడిగీ వస్తానూ

సత్యం

గిన్నెలు కేమీ తొందరలేదులె
పెళ్లామా ఇక రావే... ఇక రావే!

జానకి

పాపకు పాలూ పొయ్యాలీ, రా
పాపకపడుకోండి

[కొంతనిశ్శబ్దం తర్వాత పిల్లవాని ఏడ్పు]

శాంత

ఏమండోయ్ మిమ్మల్నే
ఏడుస్తున్నాడబ్బాయీ
పొయ్యి ఊరకేపోతోంది
పాపను ఎత్తుకుతిప్పండీ!

విశ్వం

అబ్బబ్బా! ఏమిటె శాంతా
నబ్బు పూసినా గడ్డము నెట్లా
వదలాలీ?

శాంత

వదలాలీ... వదలాలీ
వదలకపోతే ఎల్లాగూ?
బట్టతోడ గడ్డం తుడుచుకు
చిట్టిబాబునూ చూడండీ!

విశ్వం

ఒక పక్కని గొరిగిన గడ్డం
వదలట మెల్లాగే

[పిల్లవాడు నక్కపెట్టి ఏడుస్తుంటాడు.]

శాంత

గుక్కపెట్టి పా పేడుస్తుంటే
గడ్డానికి సమయ మిదేనా?

విశ్వం

చంకలోకి బాబును తీసుకు
వంటచేయనే శాంతా నీనా

శాంతి

హుఁ... మీ కేం మాటలు
చెప్తారూ
మీకేం తెలుసూ మాకష్టాలూ!

విశ్వం

వంటా వద్దు తంటా వద్దూ
హోటల్ నుండి తెప్పిద్దాం
బాబిగాడినీ సముదాయిస్తే
పుణ్యముంటు నీకెంతైనా

[పిల్లవాని ఏడ్పు]

శాంత

రావోయ్ చిట్టీ రావోయ్ పట్టీ
రావోయ్ నాబంగరు తండ్రీ
ఇదిగిదుగో చిలుకను చూడూ

[చిలుక కిలకిల ధ్వని]

ఇదిగిదుగో పిల్లినిచూడూ

[పిల్లి యరుపు]

[పిల్లవాని ఏడ్పుఆగాలి]

మోటరెక్కు తావా - ముద్దుల
పాపా

[మోటరు ధ్వని]

మోటర్ డ్రైవింగ్ చేస్తావా?
బొంయి బొంయిమని హారం
పూదీ

[హారన్ ధ్వని]

రయ్ రయ్‌మనా పోనిస్తావా?

[కొంతనిశ్శబ్దం]

జానకి

ఏమండోయ్... ఏమండోయ్?

సత్యం

ఏమిటె జానకి అనుమానం?

జానకి

ఏముందీ మనమ్మాయినీ
ఎవరికి యిచ్చి చేద్దామూ?

సత్యం

విశ్వంగారి అబ్బాయి కిస్తే
దివ్యంగా ఉంటుందే.

జానకి

వాళ్లకి మనకూ, మనకూ
వాళ్లకి మాటలు లేవేమో?

సత్యం

అదిగదిగో... శాంతా విశ్వం

ఇద్దరు వస్తున్నారూ.

జానకి

ఓహోహో ! వదినగారా?
వచ్చారా, కూర్చోండీ
మన ఇద్దరి పిల్లల కిపుడూ
ముదముగ పెళ్ళిచేద్దామా?

శాంత

కట్నమెంతో చెప్పండొదినా
పట్నంచదువూ చెప్పిస్తారా?

సత్యం

అయిదొందలు కట్నంగా
అయిదొందలు పట్నపుచదువూ
లాంఛన లిచ్చి చేస్తామూ
లా పరీక్షకూ కట్టిస్తాం.
సొమ్ము ఏమి చేయిస్తావో
చెప్పవోయి విశ్వంబావా?

విశ్వం

సొమ్ములేదు గిమ్ములేదూ
సత్యం నీ విస్తే వద్దంటామా?

జానకి

అబ్బబ్బో! ఎంతా శండీ-మీ
అబ్బాయినిదిగో ఎత్తేస్తున్నా
[బొమ్మ విసిరితే వచ్చేధ్వని]
[బొమ్మపడినట్లు టంగున ధ్వని]

తాతయ్య

ఇస్... హు ...అబ్బబ్బా... ఎవరే
ఈ బొమ్మతోడ కొట్టారూ?

శాంత

అదుగదుగో-తాతయ్యా
ఇక్కడికే వస్తున్నాడూ
వుండమ్మా నీపని చెప్తా
వీపు చితకకొట్టిస్తా.

జానకి [భయంతో]

అమ్మమ్మో...ఎలాగోయి సత్యం?
అదుగో...శాంత తాతొస్తున్నాడూ
అందకుండ పరుగెత్తేస్తా-నే
అందకుండ పరుగెత్తేస్తా.

తాత

ఏమిటర్ర మీ అందరి గోలా?
ఎందుకె జానకి చాటుకు పోయావ్?

శాంత

తాతయ్యా...చూశావా

తాతయ్యా

తెలివిలేని జానకి నిన్నూ
బొమ్మపెట్టి కొట్టిందీ

తాత

భయపడకమ్మా జానకి నీవూ
పొరబాటున వేశావేమో
కలసిమెలసి మీరంతా
కొట్లాడక ఆడాలే శాంతమ్మా!

అంతా

ఇకనుం చలాగనే మే మంతా
ఒక్కమాటమీదనే ఉంటామూ

తాత

పాఠాలుబాగా చదివినవారికి
పప్పులు పెడతా నో పిల్లలారా!

అంతా

పదం డింక పోదామంతా
పాఠాల్ కంఠత పడ్దామూ!
పదండిరా . . . పదండిరా
పరుగు పరుగునా పోదామూ॥ ★

# పట్టుదల

(44-వ పేజీ తరువాయి)

లేనికోపం తెచ్చుకొని "అట్లయితే నేను యేది అడిగితే అది యిస్తావా అని గర్జించాడు. కౌత్సుడు యేమాత్రం తొణకక "చిత్తం. మహాత్మా! అట్లాగే అని జవాబిచ్చాడు. అప్పుడు ముని "సరే నాదగ్గిఱ నీవు పదునాలుగు విద్యల్ని నేర్చుకున్నావు కాబట్టి పదునాలుగు రోజుల్లో పదునాలుగు కోట్ల బంగారు నాణాలు తీసుకరా" అని ఆజ్ఞాపించాడు.

కౌత్సుడు గురువు దగ్గిర సెలవు తీసికొని గురుదక్షిణకు కావలసిన డబ్బుకై బయల్దేరాడు. అతడు వెళ్ళి వెళ్ళి రఘు మహారాజు కోటను చేరుకున్నాడు. రాజు కౌత్స్యుని ఎంతో మర్యాదతో అర్ఘ్యపాద్యాను లిచ్చి పూజించి కుశల ప్రశ్నల్ని అడిగాడు.

అప్పటికే రఘు మహారాజు గొప్ప యాగం చేసి తన కున్న ధనాన్ని, వస్తువులను అన్నింటినీ దానంచేసి, తాను మట్టిపాత్రలతో కాలం గడుపుతున్నాడు. కౌత్సుకి ఆమట్టిపాత్రలతోనే నీళ్లుయిచ్చాడు. అది చూచేటప్పటికి కౌత్సుడు "ఈ రాజు నాకు ధనం యేమిస్తాడు. యాచించి లాభంలేదని" తలచి "చూచిపోదామని వచ్చాను. యిక వెళ్తాను" అన్నాడు రఘుమహారాజుతో. అప్పుడు రఘువు అన్నాడు గదా "మహాత్మా! మీరు వెళ్ళక యిక్కడే వుండిపోదురా. మీ వనస్సులో వున్న విషయం చెప్పి నన్ను సంతోషపెట్టండి. మీరు చెప్పిన దాన్ని నేను నెఱవేరుస్తాను. నేను మీ సేవకుడను. మీకు సేవచేయుటకు నేను అర్హుడనుకానా."

"రాజా నీ చరిత్ర అద్భుతంగా వుంది. నీవు గొప్పదాతవు. నీ మట్టిపాత్రలే నీ దాతృత్వము యొక్క-గొప్పతనాన్ని వేనోళ్ళ చాటు

తున్నాయి. నేను వచ్చిన పని నీకు చెప్పరాదు. చెప్పక వుండరాదు. చెప్పి తప్పించుకొనరాదు. నిన్ని స్థితిలో అడుగుటకు నాకు నోరురావటంలేదు. కావున నాకు సెలవియ్యవలసింది'' అన్నాడు కౌత్సుడు రాజుతో.

అప్పుడు రాజన్నాడు గదా "మహాత్మా! మీరు ఏది కోరితే అది తెచ్చి యిస్తాను. నామట్టిపాత్రలను చూసి మీరు వెనుదీయనక్కర లేదు.'' కౌత్సుడు అప్పుడు రాజుతో గురుదక్షిణ సంగతి చెప్పాడు.

అదివిని రాజు ఎంతో సంతోషించి "మహాత్మా! రెండు రోజుల్లో మీరు కోరిన ధనం తెచ్చి యిస్తాను. అందాక మా యింటనే వుండండి" అని కౌత్సుని ఒప్పించాడు.

అప్పుడు రఘు మహారాజు తక్కిన రాజుల నందర్నీ అదివరకే ఓడించి వుండటంచేత యిక కుబేరునిమీదకు దండెత్తాలని నిశ్చయించాడు.

ఈ సంగతి కుబేరునికి తెలిసింది కౌత్సుడు కోరిన ధనంకోసం రఘువు తనమీదకు దండెత్తి వస్తున్నాడన్న సంగతికూడ కుబేరునికి గూఢ చారులవలన తెలిసింది.

"ఇంకేముంది. నాకొంపే మునిగింది. నేను ఎట్లాగు రఘువును జయించలేను" అని భయపడి కుబేరుడు "లెక్కలేనన్ని బంగారు నాణాల్ని తీసుకు పోయి రఘువు యొక్క ధనాగారంలో పోయండని" భటులను ఆజ్ఞాపించాడు. వారట్లే చేశారు.

ధనాగారాన్ని కాపలాకాస్తున్న భటులు రఘువు దగ్గరకు పరుగెత్తి కెళ్ళి "మహారాజా! ధనాగారంలో పెద్ద శబ్దమయింది. గలగలామంటూ ఏమిటో పెద్ద మోతగా లోపల పడ్డాయి." అని విన్నవించుకున్నారు. అప్పుడు రఘువు కుబేరుడే ధన వర్షం కురిపించి వుంటాడని గ్రహించి కౌత్సునితో ధనాగారానికి వెళ్ళి తలుపులు తెఱపించి చూసే టప్పటికి యింకేముంది దాని నిండా జిగేల్ జిగేల్ మంటూ బంగారు నాణాలే!

"మహాత్మా! యిదిగో యీ ధనాన్ని తీసుకవెళ్ళి మీ గురువుకు గురుదక్షిణగా యివ్వండి" అన్నాడు రాజు కౌత్సునితో. కౌత్సుడన్నాడు గదా "రాజా! అంతా బాగానే వుంది. నేనడిగిన పదునాలుగు కోట్ల బంగారు నాణాలు మాత్రమే నాకివ్వండి. తక్కిన ధనంనేను ఏం చేసుకుంటాను."

రఘువు "అట్లాకాదు. మహాత్మా! ధనాన్ని అంతా తీసికెళ్ళండి" అన్నాడు. అట్లా వాళ్ళిద్దరూ వివాద పడుతుంటే ప్రజలు "ఆహా! యిటువంటి యాచకునిగాని దాతనుగాని మనమెప్పుడైనా చూచామా?" అని ఆశ్చర్యపడ్డారు.

చివరకు రఘువు "మహాత్మా! మీ గురువు నాకుకూడ పూజింపదగినవారే, మీరు కోరినధనంగాక మిగిలియున్న ధనం నే నిచ్చానను కోండి" అని నచ్చచెప్పాడు. అప్పుడు కౌత్సుడు "రాజా! నీవంటి దాత ప్రపంచంలో యింకొకడు లేడు" అని మెచ్చుకొని ధనాన్ని అంతా గుఱ్ఱాలమీద, ఒంటెల మీద, ఏనుగుల మీద సంచుల్లో కట్టివేసి తీసుకుపోయి గురువుకు గురుదక్షిణగా యిచ్చాడు. గురువు తన శిష్యుని పట్టుదలకు ఎంతో సంతోషించాడు. ★

## అదీ - ఇదీ

**అసలు రహస్యం :**

"దక్షిణ కొరియా మన చేతుల్లో ఉంటే, మంచూరియాలోని సోవియెట్ పరిశ్రమల మీదికి, ట్రాన్స్-సైబీరియన్ రైలు మార్గం మీదికి, బాంబు దాడులు చేసేందుకు అది విమానస్థావరంగా ఉపకరిస్తుంది. సోవియెట్ హస్తాల్లో ఉంటే, జపాన్ మీదికి, పరిసర సముద్రమార్గాలమీదికి బాంబు దాడులు చెయ్యటానికి వారికి పనికివస్తుంది; ఇది మనకు చాలా ప్రమాదకరం... దూరప్రాచ్యంలో కమ్యూనిస్టు వరదను అరికట్టడానికి దక్షిణకొరియా మనకు ఆనకట్టలాంటిది. ఈ ఆనకట్టని మిలిటరీ, రాజకీయ ప్రయోజనాలకోసం మనం వశపరుచుకుని ఉండాలి."

(న్యూస్ వీక్‌లో జనరల్ కార్ల్ స్పాట్జ్.)

**కొరియా "విమోచన"**

నామరూపాలు లేకుండా ధ్వంసించబడిన కొరియన్ నగరాలను ఐక్యరాజ్యసైన్యాలు విమోచిస్తున్న దృశ్యాలు వార్తాఫిల్ములలో చూసి హాలెండు, బెల్జియం, ఫ్రాన్సులలో ప్రజలు హడలిపోతున్నారు. రష్యన్ దండయాత్రనుండి తమ్ము విమోచించటంకూడా ఇదే మోడల్‌లో జరుగుతుందని యూరపియన్లు శంకిస్తున్నారు.

—(న్యూస్ వీక్ - ఏప్రిల్ 2)

Regd. No. M. 4479

కళాప్రపూర్ణ కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావుగారి

ఉత్కృష్టరచన

# ఆంధ్ర వాఙ్మయ చరిత్ర

సరికొత్త పద్ధతిని, సంగ్రహరూపంలో నడచిన సమగ్రసమీక్ష. వెయ్యేండ్ల వాఙ్మయ చరిత్రకు విశుద్ధదర్పణం. పాతచరిత్రల నన్నిటిని అవలోడనచేసి, సమన్వయించి క్రోడీకరించిన సిసలయిన చరిత్ర.



శాసనాలలోనూ వాటిలోనూ అవ్యక్తస్వరూపంలో ఉండిఉండి, నన్నయధర్మమా అని ఒక్కఊపున దివ్యాకారంతో బైటపడి, నానాటికీ నవనవోజ్జ్వలంగా వికసించిన మన వాఙ్మయం పోయిన పలుపోకడలను పోడిమితో చూపెట్టజాలిన ఉత్తమ గ్రంథం.



**వెల రు 2-0-0 లు, తపాలాఖర్చు ప్రత్యేకము.**

## ఆంధ్రగ్రంథమాల

**పోస్టు బాక్సు నెం. 212, మదరాసు.**

Edited. Printed & Published by S. Sambhu Prasad .at the Andhra Patrika Press, 7.ThambuChettySt .Madras.